## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజి


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస


అమ్మ శారదా దేవి


గురు వివేకానంద


గురు సాయిబాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళ స్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..







"ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్" ద్వారా విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందించే సేవా కార్యక్రమంలో బాగంగా ఈ పుస్తకాన్ని స్క్రిబ్డ్ వెబ్ సైట్ నుంచి సేకరించి అందిస్తున్నాము. ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము.

సాయి రామ్ వారి సేవల విస్తరణలో బాగంగా ఈ ఫౌండేషన్ స్థాపించబడినది. దీనిద్వారానే అన్ని సేవలు అందించబడును. ఇటువంటి పుస్తకాలు మీరు వ్రాసినట్లయితే (లేక) సేకరిస్తే మాకు తెలియచేయండి. మేము ప్రతి విద్యార్థికి ఉచితంగా అందేలా చేస్తాము, తద్వారా ఉన్నత విలువలు, నైపుణ్యాలు కలిగిన విద్యార్థులను మన దేశానికి అందించవచ్చు. మాతో కలిసి నవ భారత నిర్మాణ కార్యక్రమంలో పనిచేయుటకు, భాగస్వామ్యం అగుటకు ఆసక్తి ఉంటే సంప్రదించగలరు.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) స్క్రిబ్డ్ వారి వెబ్ సైట్: https://www.scribd.com
2) ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ వెబ్ సైట్ : www.freegurukul.org
3) సాయి రామ్ వెబ్ సైట్ : https://sites.google.com/site/sairealattitudemanagement
4) మొబైల్ ఆప్: Free Gurukul

గమనిక: భక్తి,జ్ఞాన,ధర్మ ప్రచారార్ధం ఉచితంగా eBook రూపంలో స్క్రిబ్డ్ వారి సహాయంతో ఇవ్వడం జరిగింది. ఇది లాభార్జన దృష్టిలేని ఉచిత సేవ. ఈ సేవలో అంతర్జాలంలోని(ఇంటర్నెట్) లైసెన్సు / కాపీరైటు అభ్యంతరాలు లేనివి అనుకొన్న పుస్తకాలను గ్రహించటం జరిగినది. అనుకోకుండా ఏవైనా అభ్యంతరకరమైనవి ఉన్నచో మాకు తెలుప మనవి, వాటిని తొలగించగలము అని మనవి చేసుకొంటున్నాము.

Website: www.freegurukul.org Mobile App: Free Gurukul email: support@freegurukul.org
Facebook: www.facebook.com/freegurukul Helpline: 9042020123

" మన లక్ష్యం: విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య అనేది ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందరికి అందించబడాలి "

ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ – Free Gurukul Education Foundation

సర్వం పరమాత్మ పాద సమర్పణమస్తు

శ్రీ మహర్షి మలయాళ సద్గురుస్వామినే నమః

# గృహస్థ ధర్మావళి

ఈరోజులలో ఈ గ్రంథము ప్రతి గృహములోను చదువదగినది







గ్రంథకర్త:
శ్రీ చిన్మయ రామదాసు



ద్వితీయ ముద్రణ
1974



మూల్యం:
రు. 1-75

త్రివేణీ ముద్రణాలయము
మచిలీపట్టణము

## విషయ సూచిక

# దైవప్రార్థన

శ్లో॥ వినాయకం గురుం భాను బ్రహ్మ విష్ణు మహేశ్వరాన్
సరస్వతీం ప్రణమాదౌ సర్వకార్యార్థసిద్ధయే॥

## కీర్తన

1. మరువకె మనసా మలయాళస్వామిని
మలయాళస్వామిని మహానుభావుని

2. తిండికి కరువులు గలిగిన గాని
దండిగ సంపద వచ్చిన గాని ॥ మరు ॥

3. శత్రువు చెంపన గొట్టిన గాని
మిత్రుడు పాదము పట్టిన గాని ॥ మరు ॥

4. దుష్టులు దోషము రుద్దిన గాని
శిష్టులు సుగుణము పొగడిన గాని ॥ మరు ॥

5. రోగము లెన్నియో గల్గిన గాని
భోగములెన్నియో వచ్చిన గాని ॥ మరు ॥

6. కామ క్రోధములు కలిగిన గాని
కల్మషగుణములు పోయిన గాని ॥ మరు ॥

7. వాసాశ్రమమున నున్నను గాని
వాసము స్వగృహమైనను గాని ॥ మరు ॥



# నిత్యపఠనీయములగు మహాత్ముల మాటలు

## ధర్మరాజు ప్రతిజ్ఞలు

1. తమ్ములను గూర్చి గాని, ఇతర రాజులను గూర్చి గాని పరుషమైన మాటను మాట్లాడను.
2. జ్ఞాతులకు విధేయుడుగ నుందును.
3. స్వసుతులను, ఇతరులను సమానముగా జూచుచు సర్వులకు హితమే యాచరించెదను.

## గాంధీ శాంతి ప్రతిజ్ఞలు

1. ప్రపంచమున ఏ మానవునకును భయపడకుందును గాక.
2. భగవంతునకు మాత్రమే భయపడుదును గాక.
3. ఏ వ్యక్తిని ద్వేషింపకుందును గాక.
4. ఎవ్వరి దౌర్జన్యమునకును తలయొగ్గకుందును గాక.
5. అసత్యమును సత్యముతో జయింతును గాక.
6. అసత్యమును ఎదుర్కొనుటలో ఎట్టి కష్టములైన భరింతును గాక.

## విదుర నీతులు

నడవడికలో అలంకారము లైదు :

1. తనకు తగిన వేషము ధరించుట.
2. తన్ను తాను పొగడుకొన కుండుట.
3. తన్ను బాధించువారికి కూడ కీడు కోర కుండుట.
4. ఒకరికి తాను ఇచ్చినదానిని గూర్చి వ్యసనపడ కుండుట.
5. తన కెంత కష్టముగ నున్నను నీతిమార్గము దప్ప కుండుట.

సుఖములు ఆరు :

1. ఋణము లేకుండుట. 2. ఆరోగ్య ముండుట. 3. ఇతర ప్రదేశమునకు వెళ్లకుండుట. 4. సజ్జనులతో సాంగత్యము. 5. తాను స్వయముగ నిశ్చయించి పనిచేయుట. 6. భయములేక జీవించుట.

### నిత్యదుఃఖితులు ఆరుగురు

1. ఈర్ష్యాళువు (తనకు వచ్చిన కష్టనష్టములు ఇతరులకు రావలెనని కోరువాడు).
2. జుగుప్స గలవాడు (అసహ్యించుకొనువాడు).
3. అసంతుష్టుడు (ఉన్నదానితో తృప్తి నొందనివాడు).
4. క్రోధము గలవాడు.
5. ఎల్లప్పుడు సందేహము గలవాడు.
6. ఇతరుల ఆస్తితో జీవించువాడు.

### సేవించవలసిన అగ్నులైదు

1. తల్లిని 2. తండ్రిని 3. అగ్నిని 4. ఆత్మను 5. సద్గురువును.

### రెండే నీవి

1. నీవు భుజించిన ఆహారము.
2. నీవు చేసిన పుణ్య పాప కర్మ ఫలితములు.

### వాచిక ధర్మములు

మాట్లాడుట కంటె మౌనముగ నుండుటె మంచిది. మాట్లాడదలచినచో సత్యముగ, ప్రియముగ, ధర్మముగ నుండవలెను.

కఠినపు మాటలు మానవుల మర్మస్థానములను ఎముకలను, హృదయమును, ప్రాణమును దహించును.

# గృహస్థ ధర్మావళి

## 1. ఒక విరాగియొక్క పాట (హిందీ)

1. దిన నీకే బీతే జాతేహై
సుమిరన కర శ్రీరామనామ
త్యజవిషయభోగ ఔర్ సర్వకామ్
తేరే సంగ చలే నహి ఏక్ దామ్
జో దేతేహైం సోపాతాహైం ॥ దిన ॥
2. భాయీ బంధు ఔర్ కుటుంబ పరివారా
కిస్ కే బలహరినామవిసారా
కిస్ కే హో తుమ్ కౌన్ తుమ్హారా
సబ్ జీతే జీకేనాతేహై ॥ దిన ॥
3. లఖ్ చౌరాసీ భరమకే ఆయే
బడే భాగ మానుషతన్ పాయే
తిన్ పర్ భీ నహీం కరో కమాయీ
ఫిర్ పాఛే పఛతాతేహైం ॥ దిన ॥
4. జో తూలాగే విషయ విలాసా
మూర్ఖ ఫంసే మృత్యు కీ పాశా
క్యా దేఖే శ్వాసా కీ ఆశా
గయే ఫిర్ నహీం ఆతే హైం ॥ దిన ॥

తాత్పర్యము :

1. రోజులు త్వరత్వరగ గడచిపోవుచున్నవి. శ్రీరాముని నామమును స్మరించుము. సమస్త విషయ భోగములను, కామములను వదలుము. ఒక్కదమము (అనగా

1 లో 20-వ భాగపు) అన్నముకూడ నీతో రాదు. దానము చేసినవారే తిరిగి పొందెదరు.

2. రోజులు చకచక గడచిపోవుచున్నవి. సోదరులు, స్నేహితులు, బంధువులు, కుటుంబమందలి తదితరులు వీరందరు నీవు జీవించియున్నంతవరకే నీతో నుందురు. ఆతరువాత నీ వెవరివాడవు? నీవారెవరు? ఇట్టి వీరిని నమ్ముకొనియేగాదా, నీవు హరినామమును మరచితివి.

3. రోజులు త్వరత్వరగ గడచిపోవుచున్నవి. నీ విప్పటికి ప్రపంచమందు ఎనుబదినాలుగు లక్షల జన్మల నెత్తి, అదృష్టవశాత్తుగా ఈ మనుష్యదేహమును పొందగలిగితివి. ఇప్పటికి కూడ నీవు రానున్న జన్మమునకు ఏమియు ఆర్జింపనిచో (సంపాదించనిచో) ఆతరువాత పశ్చాత్తాపపడవలసి వచ్చును.

4. దినములు కడు తొందరగా పోవుచున్నవి. ఇంకను నీవు విషయ భోగములలో దగుల్కొనియున్నచో, ఓరీ మూర్ఖుడా! నీవు మృత్యుదేవత పాశముతో బంధింపబడుదువు. ఇంకను చాలకాలము ఇచట నుందునని ఆశ ఏల పెట్టుకొనెదవు? గతించినది మరల రాదని జ్ఞప్తియందుంచుకొనుము. దినములు అతిత్వరగ గడచుచున్నవి.

శ్లో. రత్యంతరే మూత్ర పురీషయోర్వా, చండాలవేశ్మన్యథవా శ్మశానే
కృతప్రయత్నోఽప్యకృత ప్రయత్నః సదాస్మరేత్ కేశవనామధేయం.

తా. రతికాల (సంభోగ) కాలమందుగాని, మలమూత్ర విసర్జన సమయమందుగాని, మాలపల్లెయందుగాని,



శ్మశానభూమియం దుండినగాని, స్నాన సంధ్యాది కృత్యములచే శుభ్రముగా నుండిగాని, శుభ్రముగా నుండని సమయమునగాని సర్వేశ్వరుని స్మరణ ధ్యాన కీర్తనముల జేయవచ్చును అని వైశ్వానరశాస్త్రము చెప్పెను.

## 2. ధర్మపదములు

### శ్రీ బుద్ధదేవుడు

1. అధర్మ వర్తనములతో నూరు సంవత్సరములు జీవించుటకన్న ధర్మప్రవర్తనముతో ఒక్కదినము జీవించుట మేలు.

2. దేహ ధనాది వస్తువులు పుట్టి చచ్చు విధములను తెలిసికొనక నూరు సంవత్సరములు జీవించుటకన్న వాటి యథార్థమును గుర్తించి ఒక్కదినము జీవించుట మేలు.

3. దుష్టబుద్ధి గల్గి మనోనిగ్రహము లేనివాడై నూరు సంవత్సరములు జీవించుటకన్న ప్రజ్ఞావంతుడై, నిగ్రహచిత్తుడై ఒక్కదినము జీవించుట మేలు.

### తిరువళ్లువరులు

4. నశించునట్టి దేహ ధనాది వస్తువులను శాశ్వతములని భ్రమించుటకంటె గొప్ప తప్పు మరొకటి లేదు.

5. ఐశ్వర్యము అనిత్యమైనది. అది నీకు సమకూరునేని శాశ్వత కల్యాణము చేకూర్చు పనులు చేయుట కెంతమాత్రము నాలసింపకుము.

6. నిన్నటి మనిషి ఈరోజున లేడే! ఈ ప్రపంచములో నింతకంటె గొప్పవింత యేదిగలదు!

7. కోరికలు లేనివారికి దుఃఖమే లేదు. కాని విషయములవెంట పరుగిడువానికి కష్టపరంపరలు నిరంతరమును వచ్చుచునే యుండును.

8. ఖర్చుపెట్టవలసినచోట ఖర్చుపెట్టని పిసినిగొట్టు ఐశ్వర్యము చివరకు ఊరు పేరు లేకుండ ధ్వంసమగును.

బైబిలు

9. చెడుదృష్టిగలవారు ఆస్తిని సంపాదింప ఆతురపడుదురు. తమకు దరిద్రము వచ్చునని వారికి తెలియదు.

10. బీదల కిచ్చువారికి లేమి (దరిద్రము) గలుగదు.

11. అబద్ధములాడి ధనము సంపాదించుట మరణము గోరువారి కొనయూపిరితో సాటి.

శ్రీ గాంధి

12. అన్న వస్త్రాదులకన్న పుణ్యమే (సుకృతములే) మన కెక్కువ.

గ్రంథకర్త

13. అహింస, త్యాగబుద్ధి (నిరాశ), దైవ (ఆత్మ) చింతన లేనివారు మానవు లనతగదు.

## 3. సుప్రబోధము

తల్లులారా! తండ్రులారా! వేదాంతశాస్త్ర జ్ఞానధర్మములు సన్న్యాసులకును, మఠములలో వనములలో నివసించు వారికిని, నైష్ఠిక బ్రహ్మచారులకును ఏర్పడినవే గాని భార్యా బిడ్డలతో, బంధుమిత్రాదులతో, ధన ధాన్యాది వస్తు



వులతోను ఉన్న మావంటి గృహస్థులకు ఏర్పడినవిగా వని మనవారిలో ననేకులు తలంచుచున్నారు. ఇట్లు తలంచుట తప్పు. ఎందుచేతననగా బ్రహ్మచారులు, సన్న్యాసులు, మహాత్ములు, భక్త నారీమణులు మొదలైన ఉత్కృష్ట మానవులందరును గృహస్థులనుండి వచ్చినవారే గదా! క్రొత్తగా యాకసమునుండి దిగిరాలేదు గదా! పునాదిలేనిచో పైన భవనమును నిర్మించుటకు వీలుపడనట్లు గృహస్థధర్మము సరిగా లేనిచో ఉత్తమ పురుషులు, ఉత్తమ నారీమణులును పుట్టుటకు, జీవించుటకును వీలులేదు.

జ్ఞాన సంపాదనకు స్థలము ప్రధానముగాదు. సుహృదయమే యను విషయమును మరువకూడదు.

మఠములలో, వనములలో నున్న వారందరును ఉత్తములే యనుకొనుట పొరపాటు. గృహస్థాశ్రమములలోనున్న వారందరును వట్టి అవివేకులు, మూఢులు ననుకొనుట అంతకంటె పొరపాటు. పురుషులకేకాని స్త్రీలకు బ్రహ్మవిద్యకు అధికారము లేదనుట మరింత పొరపాటు. వేదాంతమార్గమును నడివయస్సు దాటినవారు అవలంబించవలెనేగాని చిన్న వయస్సుగలవారు అవలంబించరాదనుట బొత్తిగా పొరపాటే. ఇదెట్లున్నదనగా, రోగము వచ్చినపుడు ముసలివారు మందును సేవించవలెనేగాని పిన్నవయస్సుగలవారికి రోగము వచ్చినచో మందును తీసికొన నవసరము లేదని చెప్పినట్లున్నది. మరియు ముసలివారు మాత్రమే పాపకర్మలు చేయక పుణ్యకార్యములను, జ్ఞానగుణములను ఆశ్రయించవలెనేగాని చిన్న వయస్సుగలవారికి పుణ్యకార్యములతో, జ్ఞానగుణములతో పని యేమియుండును అని వాదించినట్లును ఉన్నది.

శ్రీ పాండురంగభక్తవిజయములోగల భక్తుల చరిత్రలను, శ్రీ మహాభక్తవిజయములోగల భక్తుల చరిత్రములను, శ్రీ వేంకటేశ్వర భక్తవిజయములోగల భక్తుల చరిత్రలను, శ్రీ గాంధీమహాత్ముడు, తిలక్, ఠాగూరు మొదలైన దేశోద్ధారకుల జీవితచరిత్రలను పరికించి చూచినచో, వారు చిన్న వయస్సునుండి భక్తితో, జ్ఞానముతో నుండి యెట్లు గృహస్థ ధర్మము నిర్వహించిరో మీకే తెలియును.

సన్న్యాసులకన్నను గృహస్థులకె ముఖ్యముగా వేదాంత శాస్త్రధర్మము లుండవలెను. గృహస్థులుగా నుండియు పూర్వపు రాజులు సన్న్యాసులకును, వనవాసులకును వేదాంత జ్ఞానోపదేశము చేసినట్లు ఉపనిషత్తులలో గలదు.

నడచువారికి మాత్రమే మంచిదారియేదో, ముళ్ళదారి యేదో తెలిసికొనవలసిన పనియున్నదిగాని ఒకేచోట కూర్చొనినవారికి ఆ విచక్షణలతో పనిలేదుగదా. ఇట్లే మాట్లాడువారికే సత్యాసత్య, మృదుకఠినాది వాగ్ధర్మ విచారణ లుండవలెనుగాని మౌనముగా నున్నవారికి ఆ విచారణలతో పనిలేదుగదా. ఇట్లే మనోవాక్కాయములతో నెక్కువగా ప్రవర్తించువారికి వేదాంతధర్మములు ఉండుట అవసరమగునుగాని సన్న్యాసుల కెక్కువ పనిలేదని చెప్పవచ్చును.

శ్లో. వనేపి దోషాః ప్రభవంతి రాగిణాం
గృహేపి పంచేంద్రియ నిగ్రహస్తపః
అకుత్సితే కర్మణియః ప్రవర్తతే
నివృత్తరాగస్య గృహం తపోవనమ్.

తా. రాగ (కోరిక) ద్వేషములు గలవారు వనమునందుండినను దోషములే గలుగుచుండును. గృహమునందుండి



నను పంచేంద్రియములను నిగ్రహించినవాడు తపస్సంపన్నుడే యగును. పాపపు కర్మములను చేయనివాడు ఎచ్చటనుండినను జ్ఞానియే యగును. కోరికలు లేనివానికి గృహము తపోవనమువంటి పుణ్యభూమి యగును అని పార్వతీదేవికి శివుడు చెప్పెను.

గృహస్థాశ్రమమునందుండి (సంసారమునందుండి) విషయవాంఛాశూన్యుడై, జ్ఞానసంపన్నుడై ఒక్కడున్నను వాడు పరమహంస పరివ్రాజక యతీశ్వరుడని నాయభిప్రాయము. సన్యాసాశ్రమమును స్వీకరించినవాడైనను నిర్వాసన (నిర్వికల్ప) స్థితి గలుగక, జ్ఞాననిష్ఠ లేనివాడు గృహస్థుడే (పెద్ద సంసారియే) యని నా తలంపు అని శ్రీ మలయాళ సద్గురు స్వాములవారు సెలవిచ్చిరి.

ఇక ఒక చిన్న ఇతిహాసమును చెప్పి ఈ వ్యాసమును పూర్తిచేసెదను. ఒక నగరమందొక రాజు కలడు. ఆ రాజగృహమునకు ఒక సన్న్యాసి రాగా, ఆ సన్న్యాసిని ఆ రాజు చాల గౌరవించి "ఇచ్చటనే తమ రుండగోరెద" నని మిక్కిలి భక్తితో వేడుకొనగా ఆ సన్న్యాసి ఆ రాజగృహమందే నివసించుచుండెను. ఈ సన్న్యాసిని రాజుగారి బంధుమిత్రాదులు కూడ మిక్కిలి ప్రేమతో గౌరవించుచు, ధనాదుల నిచ్చుచు కొంతకాలమునకు భోగలంపటుని జేసిరి. రాజుగారుమాత్రము ఆ సన్న్యాసిని గురువుగా గ్రహించి గురువుగారు చెప్పిన వేదాంత శాస్త్రధర్మములను తు. చ. తప్పకుండ నడచుచు దినదినము జ్ఞానవంతు డగుచుండెను. గురువగు సన్న్యాసి స్తుతిగౌరవాదులకు లోబడి భ్రష్టుడగుచుండెను. ఆ నగరముయొక్క వెలుపల ఒక మహాత్ముడు

నివసించుచు తన శిష్యులకు జ్ఞానబోధనలు ప్రతిదినము చేయుచుండెను. ఒక దినమున ఆ మహాత్ముడు శిష్యులకు బోధలు చేయుచు రెండు మూడు పర్యాయములు ఎక్కువగా నవ్వెను. అపుడు శిష్యులు ఆశ్చర్యపడినవారై, "గురుదేవా! తామిది వరకెన్నడు ఈవిధముగా పకపక నవ్వి యెరుగరు. ఈదినము నవ్వుటకు కారణమేమో సెలవిం" డని యడగిరి. అపుడా మహాత్ముడు, "ఈ నగరములో రాజును, ఆ రాజగృహములో ఒక సన్న్యాసియు గలరను విషయము మీ యందరకును తెలియునుగదా! ఇప్పుడా రాజును, సన్న్యాసియు చనిపోయిరి. రాజు ఊర్ధ్వ (పై) లోకమునకును, సన్న్యాసి అధో (క్రింది) లోకమునకు పోవుచుండిరి. అందువలననే నాకు పట్టరాని నవ్వువచ్చెను" అని చెప్పగా, అప్పుడా శిష్యులు, "స్వామీ! రాజు సంసారిగదా, సన్న్యాసియో జ్ఞానిగదా. ఇట్లుండియు రాజు పైలోకమునకును, సన్న్యాసి అధోలోకమునకును పోవుటకు కారణమేమి?" యని అడిగిరి. అప్పుడా మహాత్ముడు, "రాజు సంసారిగా నున్నను ఆసన్న్యాసిని గురువుగా నెంచుకొని ఆయన చెప్పిన భక్తి జ్ఞాన వైరాగ్యాది సద్గుణములను తప్పకుండ ఆచరించుటవలన జ్ఞాని యయ్యెను. సన్న్యాసి యయ్యెను. గురువగు సన్న్యాసియన్నో ఇతరుల స్తుతి గౌరవాది భోగములకు లోబడి అజ్ఞాని యయ్యెను. సంసారి యయ్యెను. అందువలన వారి కా గతులు గలిగెను. సంసారియైనను, సన్న్యాసియైనను వివేకవైరాగ్యాదులున్ననే జన్మ సార్థకతజెందు" నని చెప్పెను.

కనుక సన్న్యాసులకే వేదాంతమార్గ మేర్పడినదిగాని మనకుగాదని అధైర్యపడి చెడిపోకుడు.



## 4. జీవిత ముఖ్యధర్మము

దైవాత్మస్వరూపులారా! ప్రతి గృహమునందును రెండుండవలెనని పెద్దలు చెప్పిరి. అవేవన: ఒకటి వంటశాల, రెండవది సత్పుస్తకభాండాగారము. వంటశాల శరీర పోషణకొఱకును, సత్పుస్తకభాండాగారము ఆత్మ (జీవుని) పోషణకొరకును . అగును. శరీరపోషణ కంటెను ఆత్మ పోషణ గొప్పది. ఎందువల్ల ననగా: ఈ శరీరము కొంత కాలముమాత్రమే యుండి పోవును. జీవుడన్నో ఆత్మ జ్ఞానము గలుగువరకును, కామ క్రోధాది గుణములు నశించువరకును చావు పుట్టుకలతో నుండుట తప్పదు. ఆత్మ పోషణ శాస్త్రవిధి ననుసరించుటవలన మాత్రమే గలుగును. కనుక శాస్త్రధర్మములను తప్పక నడచుటకు సదా ప్రయత్నము చేయుచుండుడు. శాస్త్రము లనగా అనుభవజ్ఞులైన పెద్దల హృదయములే యగును. మహనీయులైన ఆ పెద్దల హృదయములవంటి హృదయములవలె మన హృదయములు కూడ యగునప్పడే ఆ మహనీయులకు గల్గిన ఆత్మసుఖము, శాశ్వతానందము, పూజ్యత మనకును గల్గును.

ఆహారము లేనిచో దేహ మెట్లు దుఃఖ మొందునో సద్ధర్మ ప్రవర్తనలు లేనిచో జీవుడును అట్లే దుఃఖములపాలుగాక తప్పదు. వంటశాలలో దేహపోషణకు వివిధ పదార్థము లెట్లుండునో సత్పుస్తకములలో జీవుని పోషణకు వివిధధర్మములటు లుండును. కష్టపడి దేహపోషణకు ఆహారపదార్థముల నెట్లు సంపాదించుకొనుచున్నామో అట్లే ఆత్మ (జీవుని) పోషణకు అహింసయు, సత్య మస్తేయ మకామ మక్రోధాది

సద్గుణములను కష్టపడి సంపాదించుకొనవలెను. దేహపోషణకు ధన ధాన్యాది పదార్థముల నెట్లు కూడబెట్టుచున్నామో ఆత్మపోషణకొరకు దాన ధర్మాది పుణ్యకర్మములను చేసి సత్పుణ్యమును అట్లే కూడబెట్టుకొనవలెను.

పశుపక్ష్యాది మృగములు దేహపోషణకు కావలసిన ఆహారమును సంపాదించుకొనునేగాని పుణ్యమును, జ్ఞానమును సంపాదించుకొనవు. ఇట్లే మానవుడుకూడ పశు పక్షి మృగాదులవలె దేహపోషణకొఱకే పాటుపడి పుణ్యమును, జ్ఞానమును సంపాదించుకొననిచో ఈ మానవుడుకూడ పశు పక్షి మృగాదులతో సమానమే యనక మరేమనవలెను ?

## 5. పంచవిధ పాపములు : వీటి నివృత్తిధర్మములు

గృహస్థులు అయిదు విధములైన పాపములు చేయుదురనియు, ఆ పాప దోషములు పోవుటకు అయిదు విధములైన యజ్ఞములను చేయవలెననియు శాస్త్రములో చెప్పబడినది. ఎట్లన :

### పంచవిధ పాపములు

1. చెట్లను నరకుట, కూరగాయలను కోయుట.
2. నీటిని వాడుకొనునపుడు ప్రాణులు చచ్చుట.
3. చీపురుతో ఊడ్చునపుడు చీమలు చచ్చుట.
4. రోటిలో నూరునపుడు పురుగులు, చీమలు చచ్చుట.
5. పొయ్యిలో కట్టెలను పెట్టినపుడు పురుగులు చచ్చుట.



### పంచ యజ్ఞములు

1. దేవ యజ్ఞము : నిత్యమును దేవతార్చన చేయుట.
2. పితృ యజ్ఞము : తల్లి దండ్రులను, పితృదేవతలను పూజించుట.
3. మనుష్య యజ్ఞము : శక్తిహీనులకును, బ్రహ్మనిష్ఠులైన సాధువులకును భిక్ష పెట్టుట.
4. భూత యజ్ఞము : పిల్లి, కుక్క, కాకి మొదలైన జంతువులకు ఆహారము పెట్టుట.
5. బ్రహ్మ యజ్ఞము : ప్రతిదినమును భగవద్గీతాది సద్గ్రంథములను పారాయణ చేయుట.

## 6. రతి ధర్మములు

శ్లో. ఊనషోడశవర్షాయాం, మప్రాప్తః పంచవింశతిం
యద్యాధత్తేపుమాన్ గర్భం కుక్షిసః నవిపద్యతే
జాతోవా నచిరంజీవే జీవేద్వా దుర్బలేంద్రియః
తస్మాదత్యన్త బాలాయాం గర్భాదానం నకారయేత్.

తా. పదునారు (16) సంవత్సరములు పూర్తిగాని స్త్రీయందు, ఇరువదియైదు (25) సంవత్సరముల వయస్సు నిండని పురుషుడు గర్భమును ధరింపజేసినచో అట్టి గర్భము నిలువజాలదు. ఒకవేళ గర్భము నిలిచి శిశువు జన్మించినను చాలకాలము జీవించదు. ఒకవేళ జీవించినను రోగపీడితమై ప్రజ్ఞలేనిది యగును. అందువలన పరిపక్వముగానటువంటి, పూర్ణారోగ్యములేనటువంటి కన్యకు గర్భాదానము చేయరాదు.

ఋతుస్నానమునాడు అనగా వెలుపలనున్న దినమునుండి నాలుగవ దినమున (అనగా శుద్ధిస్నానమునాడు) సంభోగించి నేని విద్యాహీనుడు, వ్రతభ్రష్టుడు, పరస్త్రీరతుడు, మహా దరిద్రుడగు కుమారుని కనును. కనుక తెలిసినవారు ఋతుస్నాన దినమున స్త్రీని వదలివేయుదురు. మదనకళాశాస్త్రము రీత్యా ఆదినమున సంభోగమువలన బుట్టిన శిశువు ఆయుర్దాయ హీనుడగునని శాసించిరి. 5-వ దినమున ఉత్తమ కన్య, 6-వ దినమున సంభోగించిన మంచి పుత్రుని, 7-వ దినమున కన్యను, 8-వ దినమున ఐశ్వర్యవంతుడగు పుత్రుని, 9-వ దినమున కన్యను, 10-వ దినమున ఆచారవంతుడగు పుత్రుని, 11-వ దినమున సౌందర్యరాశియగు కన్యను, 12-వ దినమున దీర్ఘాయుస్సుగల కుమారుని, 13-వ దినమున వ్యభిచార గుణముగల కన్యను, 14-వ దినమున మంచి పుత్రుని, 15-వ దినమున ధర్మము తెలిసిన బాలికను, 16-వ దినమున పూర్ణ జ్ఞానము, ఆయువు, ఐశ్వర్యమును గల కుమారుని కనును. ఇది ఋతుదివస సంభోగమువలన సంతానప్రాప్తి యున్నవారికి గల్గు విధానము. 16 రోజులు ఋతు దినములైన పిమ్మట గర్భము ముడుచుకొనిపోవును గాన సంభోగేచ్ఛ వ్యర్థ మనబడును.

సంభోగము నిద్రవలె, ఆహారమువలె, అవసరమైన పనియనుకొనుట ఘోరమగు అజ్ఞానమేయని శ్రీ గాంధీ మహాత్ముడు చెప్పెను.

ఇరువురు లేక ముగ్గురు బిడ్డలు గలిగినతరువాత భార్యా భర్తలు బ్రహ్మచారులుగనుండి సోదరీ సోదర భావముతో ఆధ్యాత్మిక జ్ఞానధర్మముల నవలంబించి కాలము గడిపినచో



తమ జీవితములను, లోకమును పావన మొనర్చినవారగుదురు.

## 7. బిడ్డలకు నీతి గరపుట

శ్లో. కౌమార ఆచరేత్ ప్రాజ్ఞో ధర్మాన్ భాగవతానిహ
దుర్లభం మానుషం జన్మ తదప్యధ్రువమర్థదమ్.

తల్లిదండ్రులు తమ బిడ్డలను కౌమారముననే (అనగా బాల్యకాలమునందే) భక్తి జ్ఞాన వైరాగ్య అహింసా ధర్మములను బోధించి నీతిమార్గమున నడిపించుటకు ఎల్లప్పుడు ప్రయత్నించవలెను. పుణ్యవిశేషమువలననే మానవ జన్మ గల్గును. ధనము అనిత్యమైనదే యగును. కావున జీవితమును పావనమొనర్చునట్టి ధర్మములను తల్లిదండ్రులు తమ బిడ్డలకు బోధించవలెను. సత్య ధర్మములు తప్ప మానవుని రక్షించునవి మరేమియు ఇతరములు లేవు.

1. అబద్ధము లాడకూడదు 2. ఇతరులను తిట్టరాదు. 3. ఇతరులను కొట్టరాదు 4. దొంగతనము చేయరాదు 5. చుట్ట, బీడీ మొదలగునవి త్రాగరాదు 6. పెద్దలకును, దేవునకును నమస్కారములు చేయుచుండుము 7. నీతిధర్మములను బోధించు గ్రంథములనే ప్రతిదినమును చదువుము 8. పరోపకారబుద్ధితో ప్రవర్తించుము అని ఈవిధముగా తల్లిదండ్రులు బిడ్డలకు నేర్పి, కొట్టి తిట్టియైనను నడిపించవలెను. ఇపు డొక చరిత్రలోని ముఖ్యధర్మములను తెలిపెద. ఇది ఆడువారి ధర్మము.

శ్రీ బుద్ధుని చరిత్రలో శ్రీ విశాఖాదేవి యను నామము గల అమ్మగారి చరిత్ర గలదు. విశాఖాదేవిని అత్తవారింటికి పంపుటకు ముందు ఆమె తండ్రి చెప్పిన పది ధర్మములను ఇచట తెలిపెదను.

1. లోపలి అగ్నిని బైటకు పోనీయరాదు—అనగా అత్తగారు, వదినె మొదలైన ఇంటిలోనివారు మాట్లాడు మాటలను ఇరుగు పొరుగు వారికి చెప్పకుండుట. చెప్పినచో కలహములు గల్గునుగదా!

2. బైటి నిప్పును లోనికి తేరాదు—అనగా సేవకులు మొదలైన ఇతరుల కలహములను తన ఇంటిలోనివారికి చెప్పకుండుట.

3. ఇచ్చువారికి ఇవ్వవలెను—అనగా తన్నడిగి ఇంటి నుండి తీసికొనిపోయిన వస్తువును మరల తీసికొనివచ్చి ఇచ్చు వారికే ఇవ్వవలెనని అర్థము.

4. ఇవ్వనివారికి యీరాదు—అనగా తీసికొనిపోయిన వస్తువును మరల ఇచ్చివేయనివారికి ఇవ్వరాదు.

5. ఇచ్చువారికిని, ఇవ్వనివారికిని ఇవ్వవలెను—అనగా బీదలకును, బంధువులకును ఇవ్వవలెనని తాత్పర్యము.

6. సుఖముగ కూర్చుండుము—అనగా అత్తమామలు మొదలగు పెద్దలను చూచి లేవవలసిన స్థలములో కూర్చొనరాదని సూచన.

7. సుఖముగ భుజించుము—అనగా అందరను భుజింపజేసి తరువాత తాను భుజించవలెనని అర్థము.

8. సుఖముగ పరుండుము—అనగా చేయవలసిన పనులన్నిటిని పూర్తిచేసి పరుండుమని తాత్పర్యము.





9. అగ్నిపరిచర్య చేయుము—అనగా భర్తను, అత్తమామలను అగ్నివలె చూచి పూజించవలెనని సూచన.

10. లోపలి దేవతలకు నమస్కరింపుము—అనగా తన ఇంటికి వచ్చిన సాధు సజ్జనులను సత్కరించి వారికి భోజనముపెట్టి మిగిలిన ఆహారమును తాను భుజించవలెనని తాత్పర్యము. పై చెప్పబడిన పది ధర్మములను తమ పుత్రికలను అత్తవారింటికి పంపునపుడు తల్లిదండ్రులు నేర్పవలెను.

శ్లో. కుమారీం శిక్షయే ద్విద్యాం
ధర్మనీతౌ నివేదయేత్
ద్వయోః కల్యాణదా ప్రోక్తా
యావిద్యా మధిగచ్ఛతి. (హేమాద్రి)

తా. తల్లిదండ్రులు తమ కుమార్తెలకు విద్యయందును, నీతిధర్మములను తెలిసికొనుటయందును నేర్పరులగుటకు తగిన అనుకూలములను గలుగజేయవలెను. అట్టి విద్యవలన రెండు తరములవారును (ఆమె తల్లిదండ్రులు, ఆమె బిడ్డలును) శుభము నొందెదరు. పొట్లకాయ లేతగా నున్నప్పుడే దానికి మట్టిగడ్డను కట్టిన తిన్నగా పెరుగునట్లు, చిన్నతనములోనే విద్యాబుద్ధుల గరపవలెను.

## 8. గృహస్థ బ్రహ్మచర్య మననేమి?

ప్రశ్న: స్వామీ! తమరు నైష్ఠిక బ్రహ్మచారులైనప్పటికిని, అనేక గ్రంథములను చదివియుందురనియు, గృహస్థ ధర్మములు తెలిసియుందురనియు నిశ్చయించుకొని ప్రశ్నింప దలచితిని. గృహస్థ బ్రహ్మచర్యవ్రత మననేమి? అనేకులకు గ్రుడ్డివారు, కుంటివారు, మూగవారు, అనా

రోగ్యవంతులు, బలహీనులు, తెలివితక్కువవారును పుట్టుటకు కారణము లెవ్వి? మరియు కొందరకు ఆడుపిల్ల లెక్కువగా పుట్టుటకు కారణము లేవి?

జ: భార్యాభర్త లిరువురును, బ్రహ్మచర్యవ్రత దీక్షాపరులు కావలెను.

భార్య రజస్వల అయినది మొదలు పదునారు దినముల వరకు ఋతుకాల మనబడును. ఆ పదునారు రోజులలో మొదటి నాలుగు రాత్రులు, పదునొకండవ రోజు, పదుమూడవ రోజును తప్పకుండ సంభోగమును మానవలెను. మరియు పాడ్యమి, షష్ఠి, అష్టమి, ఏకాదశి, ద్వాదశి, చతుర్దశి, పూర్ణిమ, అమావాస్య, గ్రహణము, శ్రీరామ నవమి, శివరాత్రి, శ్రీకృష్ణాష్టమి, శ్రాద్ధదినము, ఆదివారము, ఆశ్లేష, మఘ, మూల, కృత్తిక, జ్యేష్ఠ, రేవతి, ఉత్తరాభాద్ర, ఉత్తర, ఉత్తరాషాఢ నక్షత్రము లందును మైథునక్రియను త్యజించవలెను. మరియు భోజనము చేయగానే సంగము చేయరాదు. మాట్లాడుచు సంగము చేయరాదు. దైవస్మరణ, ధ్యానములతో సంగము చేయవలెను.

కశ్యపుడు, దితి యను భార్యతో సాయంసంధ్యా కాలమున సంగముచేయుటవలన రాక్షసులు పుట్టిరి యని పురాణవచనము గలదు.

వ్యాసులవారు సంగముచేయునపుడు ధృతరాష్ట్రుని తల్లి కండ్లు మూసికొనుటవలన గ్రుడ్డివాడు పుట్టె ననియు, సంగముచేయు సమయమున పాండురాజు తల్లి భయముతో వణకుటచేత పాండురోగి పుట్టె ననియు భారతము చెప్పెను.



ఒక స్త్రీ గర్భవతిగా నుండి కటికవానికి సహాయము చేయుచుండుటవలన, దుర్మార్గుని కనె నని చరిత్ర కలదు.

మరియు ఉదయము, సాయం సంధ్యాకాలములందు సంగము చేయకూడదు. తలనొప్పి, కడుపునొప్పి, నడుము నొప్పి, కాళ్లు తీపులు, జ్వరము మొదలగు వ్యాధులతో నున్నపుడు, ఔషధము సేవించునపుడును సంగము చేయరాదు.

భయముతో, క్రోధముతో, దుఃఖముతో నున్నపుడు, మలమూత్రములను విసర్జించవలసిన అవసర సమయము లందును సంగము చేయరాదు.

భార్య గర్భవతియైనది మొదలు ప్రసవించు వరకును అన్యాయార్జిత ఆహారమును భుజించరాదు. చెడుపనుల చేయరాదు. చెడుగుణములతో నుండరాదు.

తల్లి క్రోధముతో, భయముతో, దుఃఖముతోనుండి బిడ్డలకు పాలియ్యరాదు.

న్యాయార్జితమైన ఆహారముతోనే బిడ్డలను పోషించు చుండవలెను.

పై జెప్పిన విధముగా ప్రవర్తించినచో తల్లిదండ్రులు, బిడ్డలున్ను ఆరోగ్యవంతులుగా, ప్రజ్ఞావంతులుగా, కీర్తి వంతులుగా, సద్గుణవంతులుగా నుందురు.

వీర్యము పలుచనయగుటచేతనే ఆడుపిల్లలు ఎక్కువగా పుట్టుచున్నారని పెద్దలు చెప్పుచున్నారు.

నలుబది చుక్కల రక్తము ఒక్క వీర్యపుచుక్క యగును గాన అధిక సంగముచే వీర్యమును పలుచనచేసి కొనరాదు.

## 9. భార్యాభర్తల సంవాదము

భర్త : (భార్యతో) సతీ! నా గురువుగారితో నేను నాకు పెండ్లిచేసుకొనుట యనిన ఇష్టము లేదని చెప్పితిని. అపుడు నా గురుభగవానుడు, "నీవు 'బ్రహ్మ సత్యము, జగత్తు మిథ్య' అను దృఢ నిశ్చయముతో కూడిన వైరాగ్యముతోనే చెప్పుచున్నావా?" యని అడిగెను. అపుడు నేను లోకములో భార్యాపిల్లల సంసారముతో బాధలుపడుచుండువారిని చూచితిననియు, సంసారము దుఃఖనిలయమైన దనెడి భయముతో చెప్పుచున్నాననియు చెప్పితిని. అపుడు గురుదేవుడు, "అట్లైనచో నీవు వివాహమాడనిచో కామ వికారములతో మహాబాధలు అనుభవించవలసి వచ్చును. కనుక వివాహముచేసికొని గృహస్థబ్రహ్మచర్యవ్రతము నవలంబించి, న్యాయమార్గమున ధనమును సంపాదించి, సంసార ధర్మమును నిర్వహించుకొను"మని సెల విచ్చిరి, అందువలన వివాహము చేసికొంటిని. ఇపుడు భార్యాభర్తల మిరువురమును శాంతియుతముగా, ధర్మయుక్తముగా గృహస్థాశ్రమమును నడిపించుకొనుచుండవలెను.

భార్య : (భర్తతో) నేనుకూడ స్త్రీలు భర్తతో, పిల్లలతో ధనాది వస్తువుల కలిమి లేములతోను, లోకమం దనేకమంది బాధలుపడుచుండు విషయములను చూచితిని, వింటిని, చదివితిని కూడ. అందువలన నా తల్లిదండ్రులతో నాకు వివాహము చేయవద్దనియు, పూర్వము శబరి వివాహ సందర్భములోనే పారిపోయి మహర్షుల దగ్గరకు చేరి ఆ మహాత్ములకు సేవచేసి చివరకు శ్రీరామచంద్రుని దర్శనము నొంది ఆ భగవానునిలోనే లీనము కాలేదా? యని చెప్పితిని. అపుడు నా తల్లిదండ్రులు, "స్త్రీలు నైష్ఠిక బ్రహ్మచర్యవ్రతములో జీవితపర్యంతము నుండుట బహు కష్టసాధ్యము కనుక మాకు అపకీర్తిని గలిగించక మా మాటలు విని వివాహము చేసికొను"మని చెప్పి పెండ్లిచేసిరి, మరల అత్తవారింటికి వచ్చుటకు ముందే నా తల్లిదండ్రులు చెప్పిన నీతులేవనగా,



ఇంటిగుట్టును ఇతరులకు చెప్పకుము, ఇతరుల గుట్టులను ఇంటిలోనివారికి చెప్పకుము.

అత్తమామలకు, భర్త, బావమరదులు మొదలగు వారికి బాధగలుగకుండులాగున వర్తించుచుండుము.

ప్రతిదినమును ఉదయమున స్నానముచేసి భగవంతుని సేవించి భక్తిజ్ఞానవైరాగ్యాది ధర్మములను బోధించు గ్రంథములను చదువుచుండుము.

ప్రభుత్వమువారు అధిక సంతానము గలుగకుండులాగున వర్తించవలసినదని పదే పదే ప్రకటించుచున్నారు గాన నీవును, నీ భర్తయు విచారించుకొని వర్తించుచుండుడు. శక్తికొలది అన్నవస్త్రాదులను దానముచేయుచు ఫలాపేక్షా రహితముగా నుండుము అని చెప్పిరి.

భర్త : ప్రేయసీ! నిన్ను చూస్తే నాకు సందేహము గలుగుచున్నది. ఎందుచేతనంటే,

ఆ. పడతి నొక్కదానిని విడిచి యించుక యమృ
తంబు లేదు, భువి విషంబు లేదు
అమృతలత లతాంగి యనురాగవతియైన
గాక మెలగెనేని గరళవల్లి

అని పెద్దలు చెప్పిరి. కనుక యిపుడు నీవు నాకు అమృతముగా కనబడుచున్నప్పటికిని, ఎప్పటికైనను విషముగా మారి నాకు దుఃఖము గలిగింతువేమో యను భయము బాధించుచున్నది.

భార్య : మీకు నేను ఎప్పటికైనను గరళవల్లిగా (విషపు తీగగా) నగుదునేమో యను సందేహము బాధించుచున్నచో, నాకు మాత్రము మీరు ఎప్పటికైనను విషముగా మారి బాధ గలిగింతురేమో యను సందేహ బాధ లేదనుకొనుచున్నారా యేమి ?

భర్త : వ్యర్థప్రసంగము లెందులకు ? మన మిరువురము ఐకమత్యభావముతో నుండి శాస్త్రధర్మములను, పెద్దలు చెప్పిన ధర్మములను స్మరించుచు భగవంతునికూడ భజించుచు జీవితమును పావన మొనర్చుకొందము.

శ్లో. అస్థిరం జీవనం లోకే అస్థిరం ధన యౌవనం ।
అస్థిరం దారపుత్రాది ధర్మః కీర్తిర్ద్వయం స్థిరమ్ ॥

శ్లో. జీవితం యస్య ధర్మార్థం ధర్మోజ్ఞానార్థమేవ చ ।
జ్ఞానం చ ధ్యానయోగార్థం సోఽచిరాన్ముచ్యతే నరః ॥

తా. ఈలోకములోని బ్రతుకు, ధనము, వయస్సు, పుత్రమిత్రాది సంసారమును అనిత్యములైనవే, ఇక ధర్మము, కీర్తియు మాత్రమే చిరకాలము నుండును.

ధర్మ ( పుణ్య ) వర్తనలు గలిగి జీవించుచుండవలయును. ధర్మవర్తనలచే నిత్యానిత్య వివేకజ్ఞానము గల్గును. వివేకజ్ఞానమున్నప్పుడే నిత్యస్వరూపుడైన పరమాత్మను ధ్యానముచేయు శక్తి గలుగును. ధ్యానము



చేయుగా, చేయగా ఆత్మసాక్షాత్కారము సిద్ధించును. ఇదే ముక్తి.

భార్య : భార్య చేసిన పాపము భర్తకు చెందుననియు, భర్త చేసిన పుణ్యములోని భాగము భార్యకు వచ్చుననియును వినుచున్నాను. ఇది నిజమేనా ?

భర్త : అది పూర్వకాలపు నియమమేకాని, ఈ కాలపు నియమముకాదు. ఎందుచేత ననగా పూర్వము భర్త చెప్పినట్లు భార్య నడచుచు దేవునివలె సేవించుచుండెడిది. భార్యాశ్రేయస్సును కోరి భర్తయు సదా ప్రవర్తించుచుండెడివాడు. ఈకాలములో ఒకరి నొకరు నమ్ముటలేదుగదా ! అందుచేతనే,

కృతయుగములో ఒక్కరు చేసిన పాపము దేశమందరకు చెందుననియు, త్రేతాయుగమునం దొక్కరు చేసిన పాపము గ్రామస్థు లందరకు వచ్చుననియు, ద్వాపరయుగమం దొక్కరుచేసిన పాపము తనవంశస్థులందఱికి అంటుకొనుననియు, కలియుగములో మాత్రము ఎవరుచేసిన పాపము వారికే చెందు ననియును గరుడపురాణము చెప్పెను. కనుక భార్య చేసిన పాపము భర్తకు, ప్రజలు చేసిన పాపము రాజుకు, బిడ్డలు చేసిన పాపము తల్లిదండ్రులకు, శిష్యులుచేసిన పాపము గురువునకును సంక్రమించునను పూర్వపు వాక్యములను పూర్తిగా నమ్మరాదు. ఇపుడు నాకు నీవు ఋణపడక, నీకు నేను ఋణపడక సమముగానే కృషి, సేవయు చేసికొనుచు కామక్రోధాది దుర్గుణములను నిగ్రహించుచు మోక్ష ధర్మసాధనలను చేసికొందము.

ఈరోజులలో భార్యాభర్తలు ఉద్యోగములు చేయుట, కూలిపనులు చేయుట, వ్యాపారములు చేయుట, వ్యవసాయము చేయించుట, ఏకులు వడుకుట చూచుచునే యున్నాముగదా!

భార్య: ధనమును సంపాదించి ఎట్లు ఉపయోగించిన మన జీవితములు పావనము లగును?

భర్త:

శ్లో. ధర్మేణార్థస్సమాహార్యోఽధర్మలబ్ధం త్రిధాధనమ్
కర్తవ్యం ధర్మపరమం మానవేన ప్రయత్నతః॥

శ్లో. ఏకేనాంశేన ధర్మార్థో కర్తవ్యో భూతిమిచ్ఛతా
ఏకేనాంశేన కామార్థం ఏకమంశం వివర్ధయేత్॥

తా. ధర్మమార్గమున ధనమును సంపాదించవలెను. దానిని మూడు భాగములుచేసి ఒక పాలు ధర్మార్థ సంపాదనమునకును, రెండవ పాలు కామపురుషార్థమునకును వినియోగించి మూడవ పాలును భద్రపరచి వృద్ధిచేసికొనవలెను.

చనిపోవునపుడు ధనధాన్యములు ఇంటిలోనే యుండిపోవుట, బంధు మిత్రాదులు శవము వెంట శ్మశానమువరకు వచ్చుటయు మన మెరుగుదుము. అటుపై పుణ్యాపాపములే (ధర్మము, భక్తిజ్ఞానములే) మన వెంట వచ్చుననియు పెద్దలు చెప్పుచున్నారుగదా! అందువలన ధనమును సత్కర్మలకు వినియోగించుచు, దేహమును పుణ్యము గల్గునట్లు వర్తింపజేయుచు, వాక్కును భగవన్నామములో, గ్రంథపఠనములో, సత్య ధర్మ వచనములతోను పలికింపజేయుచు,



మనస్సుతో జప ధ్యానములను, సద్భావములను చేయుచు మన జీవితములను పవిత్రత నొందించుకొనుచుండవలెను.

భార్య: నాథా! మదాలసవలె మన బిడ్డలను నీతిధర్మములను బోధించుచు నడిపించుకొనుచుండవలెను. మంచిమాటలను, మంచిపనులను మనము నేర్పవలెను.

భర్త: సతీ! మన బిడ్డలు సన్మార్గమున నడచుచున్న మాత్రమే మనకున్ను, లోకమునకున్ను క్షేమము గల్గును గదా! మనకు సంతాన మధికమైనచో పోషించుట కష్టము. లోకమందు జనసంఖ్య అధికమైనదని ఇరువురుగాని, ముగ్గురుగాని సంతానము గలిగిన తరువాత పూర్తిగా బ్రహ్మచర్య వ్రతము నవలంబించవలెనని శ్రీ గాంధిమహాత్ముడు చెప్పియుండెను. ఆపరేషన్ చేయించుకొనవలెనని ఇప్పటి ప్రభుత్వమువారును అనేకపర్యాయములు రేడియోల ద్వారా హెచ్చరికల జేయుచున్నారుగదా! కనుక మన కిపుడు ముగ్గురు సంతానము గలిగియున్నారుగాన యికనుండి నేను పూర్తిగా బ్రహ్మచర్యవ్రతమును బూని సోదర, సోదరీభావములతో మెలగుట మంచి దని నిశ్చయించుకొంటిని. కాన ఇక ఎన్నడును నా వ్రతమునకు ఆటంకము గలిగించకుము. ఈ మాటను సుదృఢనిశ్చయముతో చెప్పితిని. మరువకుము.

భార్య: (కొంతకాలమైన తరువాత భర్త కామ వికారములకు తాళజాలక భార్యను కోరగా) ఏమండోయ్, మీరు మనము పూర్తిగా బ్రహ్మచర్యవ్రతమును బూని యుండవలెనని నాతో గట్టిగా చెప్పియు మఱల కామ వికారములను నిగ్రహించలేక వ్రతమును చెడగొట్టుకొన దలచుచున్నారే! బ్రహ్మచర్యవ్రతము లేకయున్నచో మన

యొక్క బలము, ఆరోగ్యము, ప్రజ్ఞాశక్తియు క్షీణించి పోవుననియు, బిడ్డలు పెద్దవారగువరకును గృహములోనే పూర్తిగా బ్రహ్మచర్యవ్రతములోనుండి తరువాత వానప్రస్థ ధర్మము నవలంబించి తపస్సు చేసికొనుచుండవలెననియు శ్రీ సద్గురు మలయాళస్వాములవంటి పెద్దలు చెప్పియున్నారు.

భర్త : బ్రహ్మచర్యవ్రతావలంబన విషయములో భార్యాభర్తలలో ఒకరికి యిష్టము, రెండవవారికి అయిష్టము గలిగినచో ఏమిచేయవలయునని మలయాళస్వాములవారు చెప్పిరి?

భార్య : భర్త బ్రహ్మచర్యవ్రతము నవలంబించి, భక్తి జ్ఞాన వైరాగ్యనిష్ఠలతో కాలముగడుపుచున్నప్పుడు భార్యకు యిష్టములేక కాముకురాలై భోగవాంఛను తెలిపినచో భార్యతో భర్త, "సతీ! నేను వీర్యరక్షణ జేసికొని, దేహబలముతో ఆరోగ్యముగా బుద్ధిబలముతోనుండి పరమార్థసాధనలు చేసికొనుచు సుఖముగా జీవించుట నీకు యిష్టములేదా? నేను చనిపోవుట నీకు యిష్టమా?" యని ప్రశ్నలు వేయుచున్నచో, భార్య హృదయమును మార్చుకొనునని చెప్పిరి.

ఇట్లే భార్యయు బ్రహ్మచర్యవ్రతనిష్ఠలోయుండి భక్తిజ్ఞాన వైరాగ్య సాధనల జేసికొనుచుండగా భర్తకు బ్రహ్మచర్యవ్రతముపై యిష్టములేక కాముకుడై యుండి భార్యను కోరినచో అపుడు భార్య భర్తతో, "నాథా! నేను బ్రహ్మచర్యవ్రతము నవలంబించి ఆరోగ్యముగా, బలముగా ప్రజ్ఞాశక్తితో నుండి మోక్షసాధనల జేసికొనుట మీకు



యిష్టము లేదా? మోక్షమార్గమున నడచువారికి అనుకూలములు గలిగించుట మహాపుణ్య మనియు, ప్రతికూలము గలిగించుట మహాపాప మనియు పెద్దలు చెప్పుచున్నారుగదా!" యని బోధించినచో భర్త హృదయము మారిపోవును అని స్వామి చెప్పియుండెను. కనుక మనము యికనుండి విషయ భోగములపై గల రాగమును, ధన ధాన్యాది వస్తువులపై గల మమకారమును, పుత్ర మిత్ర బంధువులతో గల సంగమును, దేహముపై గల అభిమానమును చంపుకొనుచు కబీరుదాసు, కుసుమహరనాథ్, భద్రాచల రామదాసు మొదలగు పెద్దలవలె సక్కుబాయి, మీరాబాయి, శారదా దేవి మొదలగు మహాతల్లులవలె మన జీవితములను పరమార్థ దృష్టితో గడుపుకొందుముగాక! మనకు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరాది దేవతలు, వ్యాసాది మహాఋషులున్ను అనుగ్రహదృష్టితో సహాయభూతు లగుదురుగాక!

## 10. నిష్కామకర్మ

ప్రశ్న : స్వామీ! నిష్కామకర్మ యన నేమి? సకామకర్మ యన నేమి?

జ : పనులను చేయునపుడు అదికావలెను, యిది కావలెను; దుఃఖము పోవలెను, సుఖము కలుగవలెను యను తలంపులు లేకుండ తనకు నియమింపబడిన క్రియలను చేయుచుండుట నిష్కామకర్మ యనబడును.

అన్నము, వస్త్రము, ఆయువు, ఆరోగ్యము, కీర్తి, ధనము, లాభము, సుఖము మొదలుగునవి కలుగవలెనను కాంక్షతో పనుల జేయుట సకామకర్మ యనబడును.

ప్రశ్న : సకామకర్మల జేసిన నష్ట మేమికల్గునో, నిష్కామకర్మలజేసిన లాభ మేమికల్గునో మాకు బాగుగా బోధపడులాగున వివరముగా (విపులముగా) తెలియజేయ వలసినదని ప్రార్థన.

జ : సకామకర్మల ఫలితములు అనిత్యములైనవి కనుక అవి నశించగానే దుఃఖము వచ్చును. నిష్కామ కర్మల ఫలితం నశించదు. కనుక అక్షయ సుఖము కలుగును. అందువలననే గీత, "కృపణాః ఫలహేతవః" —ఫలాభిలాషతో కర్మచేయువారు నీచులనియు, "యజ్ఞార్థాత్కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబంధనః"- నిష్కామముగా నాచరించని కర్మబంధమును (దుఃఖమును) కలిగించునని చెప్పెనుగదా.

ఇప్పుడు మీకు కొన్ని కథల ద్వారా సకామకర్మల వలన గల్గు బాధలను తెలియజేసెదను.

1. ఒక ఊరిలో ఇరువురు అన్నదమ్ములు కలరు. అన్నకు పిల్లలు లేరు. తమ్మునికి మాత్రము ఒక కుమారుడు కలడు. అందువలన అన్న చనిపోవలెననియు, అతని ఆస్తి తన కుమారునకు చెందవలెననియు గంపెడు కోరిక నుంచుకొని ఎల్లప్పుడున్ను భగవంతుని ప్రార్థించుచుండెను. ఇట్లుండగా కొంతకాలమునకు యమదూతలు వచ్చి యీ భక్తుని యమలోకమునకు తీసికొనివెల్లి నరకదుఃఖములో నుంచిరి. వైకుంఠములో విష్ణుదూతలు శ్రీమహావిష్ణువును సమీపించి; "స్వామీ! భూలోకములో ఒకభక్తుడు రాత్రింబవళ్లును తమ నామమును భజించుచుండగా ఆ పరమ భక్తుని యమదూతలువచ్చి తీసికొనివెల్లి నరకమున పడవేసిరి.



యిది మిక్కిలి అన్యాయమైన పనిగదా!" యని చెప్పగా అపుడు విష్ణుభగవానుడు, "ఆ మానవుడు రాక్షస స్వభావముతో తన అన్న చావు నిమిత్తము నన్ను భజించినవాడుకనుక వానిని యమదూతలు తీసికొనివెల్లుట అన్యాయముకా"దని చెప్పెను. ఈకథ సకామకర్మ ఫలితమును తెలియజేసినదిగదా! అందువలననే గీత, "ముక్తసంగస్సమాచర" అనిచెప్పెను.

2. రామప్రసాదు అను గృహస్థుడు సంతానము నిమిత్తము రాత్రింబవళ్లును భగవంతుని భజించుచుండగా కొంతకాలమైన తరువాత భగవంతుడు ప్రత్యక్షమై, "నీ కేమి వరము కావలెనో కోరుకో"మనగా, "నాకొక పుత్రుని దయచేయు"మనగా, "తథాస్తు" అనిచెప్పి భగవంతుడు అదృశ్యమయ్యెను. కొంతకాలమైన తరువాత ఒక పుత్రుడు పుట్టెను. కాని అతడు అంధుడయ్యెను. అందువలన తల్లిదండ్రులు దుఃఖముతో నుండిరి. క్రమముగా పిల్లవాడు పెద్దవాడయ్యెను. తండ్రి దుఃఖపడుచుండుట కుమారుడు గుర్తించి, "నాన్నా! నీ వెందుకు ఏడ్చుచున్నావు?" యని అడిగెను. అపుడు తండ్రి, "కుమారా! సంతానము నిమిత్తము చాలాకాలము భగవంతుని సేవించగా భగవంతుడు ప్రత్యక్షమై నీ కేమి వరము కావలెనో కోరుకొను మనగా, నాకు సంతానము కలిగించమనికోరగా నిన్ను ప్రసాదించెను. నీవు గ్రుడ్డివాడవైతి వని దుఃఖపడుచున్నా"నని చెప్పెను. అపుడు కుమారుడు, "నాన్నా! నీకు భగవంతుడు ప్రత్యక్షమైనపుడు శాశ్వతమైన మోక్షము నిమ్మని కోరక అశాశ్వతమైన పుత్రు నిమ్మని కోరితివిగాన నాకంటె నీవె అంధుడవు" యని చెప్పగా తండ్రి 'నిజమే'నని ఒప్పుకొనెను.

3. మైదాసు అను ధనవంతుడు పరమ లోభి. ఇతడు భగవంతునిగురించి తపస్సుచేయగా భగవంతుడు ప్రత్యక్షమై, "నీ కేమి వరము కావలెనో కోరుకొను" మనగా, "నా హస్తముతో తాకిన ప్రతివస్తువున్ను బంగార మగునట్లుగా వరమి" మ్మని మైదాసు కోరగా, "అట్లే యగుగాక" యని దీవించి దేవుడు అంతర్ధాన మొందెను. తరువాత మన మైదాసు తన గృహములోగల ప్రతివస్తువును తాకి బంగారముగా మార్చి దాయుచుండెను. తన కుమార్తెను తాకగా ఆమె కూడ బంగారపు విగ్రహ మయ్యెను. చివరకు ఆకలి బాధ కలిగి భార్యను అన్నము పెట్ట మనగా వడ్డించెను. తినుటకు అన్నమును తాకగా అది కూడా బంగార మయ్యెను. చివరకు ఆకలిబాధతో మైదాసు మరణించెను. ఈ చరిత్రవలన కూడ ఫలాభిలాషవలన గలిగిన అనర్థకము బోధపడినది గదా!

4. తెనాలి రామలింగంగారు పూర్వ జన్మమందు ఫలాభిలాషతో దేవిని భజించుచుండెడివాడు. ఎంతకాలము భజించినప్పటికిన్ని దేవత ప్రత్యక్షము కాకపోవుటవలన, కోరిక నెరవేరకపోవుటవలన దేవిపై క్రోధము చూపుచు ఆ తల్లికి బాధ కలుగునట్లు వికట కవిత్వము చేసెను. అపుడు దేవికి కోపమువచ్చి, "మరుజన్మమున వికటకవి వగుదువు గాక" యని శపించగా వెంటనే తెనాలిరామలింగం, "నా తప్పు క్షమించు" మని వేడుకొనగా, "నీవు వికటకవివైయెనను రాజులచేతను, పండితులచేతను గౌరవింప బడుదువు" అని అనుగ్రహించెను. "మాకర్మఫల హేతుర్భూ" అని గీత 2-వ అధ్యాయములో చెప్పెను.



5. భద్రాచల రామదాసుగారిని ఖైదులో పెట్టించిన తానీషాగారు పూర్వ జన్మమున శివభక్తుడైన బ్రాహ్మణుడు, ఇతడు ఫలాకాంక్షతో శివలింగమునకు అభిషేకము చేయుచుండెడివాడు. ఎంతకాలము అభిషేకము చేసినప్పటికిని శివుడు ప్రత్యక్షము కాకపోవుటవలన శివునిపై కోపము చూపుచు అభిషేక జలపు పాత్రతో శివలింగముపై కొట్టగా శివునకు కోపమువచ్చి, "నీవు మరుజన్మమున తురక వాడవై పుట్టుదువుగాక" యని శపించెను. తరువాత, "తురక వంశమున పుట్టినప్పటికిని రాజ్యము నేలు ప్రభువు యగుదు" వని అనుగ్రహించెను.

6. ఒక మానవుడు సంతానము నిమిత్తము భగవంతుని చాలా దినములు పూజించగా సంతానము కలిగి పది దినములకు చనిపోయెను. అందువలవ దేవునిపై క్రోధము గలవాడై దేవతాపటములను పగులగొట్టి పారవేసెను.

శ్లో. కర్మజం బుద్ధియుక్తాహి ఫలంత్యక్త్వా మనీషిణః
జన్మబంధ వినిర్ముక్తాః పదం గచ్ఛంత్యనామయమ్ ॥

తా. కర్మవలన గలిగిన ఫలమునందు ఆసక్తి నుంచక నిష్కామముగానున్న మానవుడు జననబంధము నుండి విముక్తుడై దుఃఖరహిత పదము నొందును.

కోరికవలననే మానవులకు జీవించియుండగా దుఃఖములు వచ్చును. మరణానంతరము జన్మములు వచ్చుచుండును. కనుక పరమాత్మయందే ఆసక్తిగలవారై జీవించువారే సర్వదా సుఖముగా నుండగల్గుదురు.

నిష్కామముగా నున్నవారికి అన్ని సౌఖ్యములు అప్రియత్నముగా చేకూరుచుండును.

## 11. గ్రామస్థుల కర్తవ్యములు

సోదర సోదరీమణులారా! పుణ్య పాప మిశ్రకర్మల దోషములవలన జన్మలు వచ్చును. అనగా పుణ్యముచే దేవతా గుణములతో జన్మ వచ్చును. పాపమువలన రాక్షస గుణములతో జన్మ వచ్చును. పుణ్యము కొంత, పాపము కొంత గలిసిన (మిశ్ర) కర్మవలన మానవ స్వభావములు గల జన్మ వచ్చును. పరమాత్మజ్ఞానము గలిగినప్పుడే జన్మరహితమైన మోక్ష సుఖము గలుగును.

కనుక దేహ సుఖములు (భోగములు), ధన ధాన్య భూములు, పుత్ర మిత్రాదులతో గల సంబంధమును, శాశ్వతమైన వను భ్రాంతులను తొలగించుకొనుచు పరోపకార బుద్ధితో, పరమాత్మ చింతనతో, విషయ భోగములపై విరక్తితో జీవితమును గడుపుట మన ముఖ్య కర్తవ్యమను విషయమును మరువకుడు.

ప్రతిగ్రామమందును భజన సమాజము లుండవలెను. వారమున కొకసారియైనను స్త్రీ పురుషులు సమావేశమై భగవద్భజన, ప్రార్థనలు, కర్మ, భక్తి, జ్ఞాన, వైరాగ్య నీతిధర్మముల పఠనలున్ను తప్పక జరుపవలెను.

హింస, దొంగతనము, వ్యభిచారము, అసత్యము, అన్యాయము (మోసము) మొదలగు దుష్టపనుల జేయక కామం, క్రోధం, ఆశ, దంబము, మదము, మాత్సర్యము, కపటము, అహంకారము, అసూయ, ద్వేషము, ఈర్ష్య మొదలగు దుర్గుణములను చంపుకొనుచు సోదరభావముతో మెలగవలెను.





జీవించియున్నపుడు, మరణించిన తరువాతను ఆనందముగా నుంచునట్టి నిష్కామ పుణ్యమును, దైవభక్తిని, సద్గురుభక్తిని, వైరాగ్యమును, స్వాత్మజ్ఞానమును సంపాదించుకొనవలెను. ధనమునకు, గృహమునకు, బంధుమిత్రాదులకు కీర్తి ప్రతిష్ఠలకు అమ్ముడుపోక, దాసులుకాక, జీవితమును మోక్షమార్గమున నడిపించుటకే మనము పుట్టితి మను విషయమును రాత్రింబవళ్లను మరువరాదు. మరచినవారు మానవులు కారు, పశువులే.

ప్రతిక్షణమును దైవాత్మలను, నీతిధర్మముల దృష్టిలో నుంచుకొనియే పనుల జేయవలెను, మాట్లాడవలెను. చూడవలెను. వినవలెను. తాకవలెను.

## 12. ఆస్తి తగ్గుటచే మేలు

ప్రభుత్వమువారు ధనవంతుల ఆస్తులను తీసికొని బీదలకు పంచిపెట్టుచున్నందులకు ధనవంతులు బాధపడ నవసరములేదు. ధన మధికముగా నుండుటచేత పను లధికమగును. మాట లధికమగును. చింత లధికమగును. బంధుమిత్రాదు లధికమగుదురు. రోగము లధికమగును. అందు లన దేవుని స్మరించుటకు, మంచిచెడ్డలను, నిత్యానిత్యమును, కర్తవ్యాకర్తవ్యములను, ఆత్మానాత్మలను విచారించుటకు, మంచి గ్రంథములను చదువుటకును తీరిక యుండదు. తీర్థయాత్రలు గావించుటకు, పెద్దలను దర్శించుటకు, జపధ్యానముల జేయుటకు, వేళకు సుఖముగా నిద్రించుటకును అవకాశ ముండదు.

ధనవంతులకు ఆకలి తక్కువ. శాంతి తక్కువ. ఆరోగ్యము తక్కువ. భక్తి తక్కువ. ధైర్యము, దయ తక్కువ. దరిద్రులకు ఆక లెక్కువ, ఆరోగ్య మెక్కువ. శాంతి యెక్కువ. భక్తి వైరాగ్యము లెక్కువ. త్యాగము, దయ లెక్కువ. ధైర్య మెక్కువ.

దరిద్రము, భగవద్భక్తి, సజ్జనసాంగత్యమును గలవారే పుణ్యాత్ము లని శాస్త్రము చెప్పెను.

"ధనవంతులు మోక్షము నొందుట కంటె, సూది బెజ్జములో ఒంటె దూరుట బహు సులభము" అని క్రీస్తు చెప్పెను.

"ఐశ్వర్యము కంటె సుకృతములే (పుణ్యములే) మన కెక్కువ" అని గాంధీ చెప్పెను.

ధనవంతులారా! మీ భారమును ప్రభుత్వమువారు తగ్గించి దరిద్రుల నెత్తిని పెట్టు రోజులు వచ్చినందువలన సంతోషించవలెనేగాని చింత (బాధ) పడకూడదు.

### ఐశ్వర్యముకంటె దారిద్ర్యము గొప్పది

శ్లో. అకించన్యంచ రాజ్యంచ
తులయా సమతోలయమ్
అత్యరిచ్యత దారిద్ర్యం
రాజ్యాదపి గుణాధికమ్ ॥

తా. త్రాసులో ఐశ్వర్యము నొకప్రక్కన, దారిద్ర్యమును రెండవ వైపున పెట్టి తూచగా ఐశ్వర్యముకంటె దారిద్ర్యమే విశేష బరువుగా నుండెను.



శ్లో. దరిద్రాయ నమస్తుభ్యం
సిద్ధోఽహం త్వత్ప్రసాదతః
సర్వం పశ్యామి దేవేశ
న మాం పశ్యతి కశ్చన ॥

తా. ఓ దరిద్రదేవతా! నీకు నమస్కారము. ఎందువల్లననగా, నీ అనుగ్రహము వల్లనే కదా నేను జ్ఞాన సిద్ధుడనైనది. ఎట్లందువా: నేను అన్నిటిని చూచుచున్నను, నన్ను ఒక్కరున్ను చూడలేకపోవుచున్నారు.

భక్తి జ్ఞాన వైరాగ్య ధర్మములు దరిద్రులైనపుడే హృదయములో నిలచును. శ్రీ బుద్ధుడు, శంకర, రామానుజాది మహాత్ములందరున్ను దరిద్రులుగా నుండి తపస్సు, దైవ ధ్యానము చేసి లోకపావనులైరి.

ఐశ్వర్యమును కోరువారు యింతవర కెవ్వరున్ను ధన్యులు కాలేదు.

### కైవల్య సుఖము కంటె పరోపకార సుఖము గొప్పది

శ్లో. పరోపకృతి కైవల్యే
తులయిత్వా జగద్గురుః
గుర్వీం చోపకృతిం మత్వా
అవతారాన్ దశాఽగ్రహీత్ ॥

తా. జగద్గురు డగు భగవంతుడు కైవల్య సుఖమును, పరోపకారముచే కలుగు సుఖమును త్రాసులో పెట్టి తూచగా, కైవల్య సుఖము కంటె పరోపకార సుఖమే బరువుగానుండెనట. అందువలననే, దశావతారము లెత్తి పరోపకార మొనర్చెను.

## 13. నా సహాయం నీకు - నీ సహాయం నాకు

"పరస్పరం భావయంతః శ్రేయః పరమవాప్స్యథ"

అని గీత ౩-వ అధ్యాయంలో గలదు. అనగా, ఒకరి కొకరు సహాయము జేసికొనుచు శ్రేయస్సు నొందుచుండ వలె నని తాత్పర్యము.

ఒకరి కొకరు సోదరభావముతో సహాయము జేసికొనక పోవుటచేతనే. లోకములో అనేకచోట్ల గృహములలో, గ్రామములలో, మతములలోను కలహములు, దొంగ తనములు, హత్యలు, ద్వేషములున్ను వచ్చుచున్నవి. జరుగుచున్నవి. పుట్టుచున్నవి.

కష్టములు వచ్చినపుడు, నష్టములు సంభవించినపుడు, తన పెత్తనమును సాగించుకొనవలె నను ఇచ్ఛయున్నప్పుడును లోకములో, జనులలోను అశాంతితోగూడిన పాపముతో, అధర్మముతో మిశ్రితము లైన సంఘటనలు జరుగుచున్నవి.

దేవునిపై, ఆత్మపై, ధర్మముపై, వైరాగ్యముపైని దృష్టిపి, విశ్వాసమును స్థిరముగా నుంచుకొని ఓర్పుగలిగియున్న గృహములో, మతములో, హృదయములో, గ్రామములో సమత్వము, ఆనందమును తాండవమాడుచుండును. దేహ పోషణకు, కుటుంబ పోషణకును మించినటువంటి దురాశకు దాసులైనపుడు మానసాదీంద్రియములు అధర్మమువైపునకు, అసత్యము దిశకును పరుగు లిడుటకు ఇచ్ఛగించుచుండును.



కుల భేదములను పాటించక, గుణమునకు ప్రాధాన్యత నిచ్చుచు ప్రవర్తించుచుండవలెను. గొప్పవాగిని అల్పులని భావించుట, అల్పులను గొప్పగా గౌరవించుటయును అశాంతికి కారణము లగును.

అన్నము, వస్త్రము, ఔషధము, నివాసగృహమును స్వార్థగుణము లేకుండ అందరకును సమకూర్చుచుండవలెనని ప్రభుత్వము సంకల్పించుచున్నందున ధనవంతులు బాధపడక ప్రభుత్వము చెప్పినట్లు నడచుట సర్వజన శ్రేయోదాయక మగును.

దేవతలు ఎండ, గాలి, వాన మొదలైనవి మానవాది జీవులకు సహాయముచేయుచున్నారు. మానవులు దేవతలకు యజ్ఞము, పూజ, నమస్కారము, భజనలున్ను చేసి సంతుష్టి గలిగించవలెను.

భర్తకు భార్య, భార్యకు భర్తయును ఇహపరసుఖ సాధన కర్మలలో సహాయము చేసికొనుచుండవలెను.

తండ్రికి బిడ్డలు, బిడ్డలు తండ్రికిని సహాయము చేసికొనుచుండవలెను. తల్లికి కుమార్తె, కుమార్తెకు తల్లియు సహాయ మొనర్చుకొనవలెను.

అన్నదమ్ములుకూడ ఒకరి కొకరు సహాయభూతులుగా నుండవలెను.

బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రాది వర్ణభేదములను విడిచి ఒకరి కొకరు సహాయ మొనర్చుకొనుచుండవలెను.

సన్న్యాసులకు గృహస్థులు అన్నము, వస్త్రము, ఔషధము, నివాసగృహము మొదలైనవి ఇచ్చుచుండవలెను. గృహస్థులకు సన్న్యాసులు భక్తి, జ్ఞాన, వైరాగ్య,

నీతిధర్మములను బోధించుచుండవలెను. దేవుని విశేషముగా జప ధ్యాన ప్రార్థనలు జేసి గృహస్థుల బాధలను శాంతింప జేయుచు ధైర్యోత్సాహములు గలిగించుచుండవలెను.

గురువునకు శిష్యుడు, శిష్యునకు గురువున్ను సహాయముగా నుండవలెను.

దేహము, ధనాదులున్ను అశాశ్వతము లైనవి, మట్టి పాలగునవి గాన అభిమానమును (అహంకారమును), లోభ గుణమును (దురాశను), అసూయ, ఈర్ష్య, ద్వేష భావములను వదలి ఏకైక భగవంతుని కుటుంబముగా నిశ్చయించుకొని నేను నీవు, నాది నీది యను భావములులేని సోదర భావములతో మెలగవలెను.

పెద్దలు ఒక కథ చెప్పెదరు.

ప్రజాపతికి అదితి, దితి యను ఇరువురు భార్యలు కలరు. అదితికి దేవతలు పుట్టిరి. దితికి రాక్షసులు పుట్టిరి.

ప్రజాపతికి దేవతలపై ప్రేమ గలిగియుండుట, రాక్షసులపై ప్రేమ లేకపోవుటయును రాక్షసులు గుర్తించి, "తండ్రీ! మేమును, దేవతలున్ను మీ బిడ్డలమేగదా! మాపై ప్రేమ లేకుండుట, దేవతలపై ప్రేమ జూపుటయును నీకు న్యాయమా?" యని రాక్షసులు ప్రశ్నించిరి. అపుడు తండ్రియగు ప్రజాపతి, "రాక్షసులగు మీరు సోదరభావముతో నుండక, అల్పగుణములతో నుంటున్నారు. దేవత లన్నన్నో సోదరభావముతో మెలగుచుందురు. మీకంటె చాలా తెలివిగలవారు. అందువలన వారిపై విశేష ప్రేమ చూపుచుందు" నని చెప్పెను.



అపుడు రాక్షసులు, "మాలో కంటె దేవతలలో విశేష తెలి వేమిగలదో ప్రత్యక్షముగా మాకు చూపు" డని తండ్రి నడిగిరి.

అపుడు తండ్రియగు ప్రజాపతి దేవతలను, రాక్షసులను పిలిపించి ఒక విందు యేర్పాటుగావించి, "విస్తరాకులలో గల మిఠాయి, గారెలు మొదలగు పదార్థములను మోచేయి వంచకుండ మీరు భుజించు" డని మొదట రాక్షసులతో చెప్పెను. అపుడు రాక్షసులు మోచేతిని వంచకుండ పదార్థములను అరచేతితో నోటివైపునకు విసరుకొనుచుండగా ...టిలో పడక కొన్ని ముఖమునకు తగిలి పడిపోవుచుండెను. ...రికొన్ని మూతికి తగిలి పడిపోవుచుండెను. ఇంకా ...న్ని బుగ్గలకు, కంఠమునకు తగిలి పడిపోవుచు పదార్థము...న్నియు ఆకలిబాధను తీర్చక వ్యర్థము లయ్యెను. ...క దేవతలకు వడ్డింపగా వారు విస్తరాకును మధ్యలో ...ంచుకొని ఎదురుబొదురుగా కూర్చొని, ఒకరి నోటిలో ...కరు మోచేతిని వంచకుండ అరచేతితో తీసికొని పెట్టుకొని, పదార్థముల నేమియు వ్యర్థముగానీయక సంతృప్తి...రముగా భుజించిరి. అపుడు రాక్షసులకు సిగ్గువచ్చి, "మా...టె దేవతలే గుణవంతులు. సోదరభావముతో మెలగు...ందురు. అందువలననే మన తండ్రి దేవతలపై విశేష ప్రేమ జూపుచు మెలగుచున్నా" డని నిశ్చయించుకొనిరి.

ఇట్లే ఈ మానవ లోకములో (మానవులలో) దేవతా స్వభావులు రాక్షస స్వభావులు నుందురు.

## 14. ఎవ రెక్కువ? ఎవరు తక్కువ?

అహింస, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము, దయ, కరుణ, నిష్కపటత్వము, నిత్యానిత్య వస్తువిచారణ, వైరాగ్యము, పరమాత్మధ్యానము, సమత్వదృష్టియు గలవారు లోకములో శ్రేష్ఠు లనబడుదురు. ఇట్టివారు దరిద్రులుగా నున్నను, కులములో తక్కువవారైనను, స్త్రీలైనను, చదువు లేనివారుగా నున్నను పూజనీయు లనబడుదురు. ఇట్టివారిని ఎవరైనను దూషించినను, బాధలు పెట్టినను మహాపాపము గలుగును. ఆపదలపా లగుదురు. ఉత్తములే లోకమునకు దిక్కు, ఆధారము నగుదురు.

ధనవంతులైనను, విద్యావంతులైనను, ఉద్యోగస్థులైనను సత్ప్రవర్తనలు, సద్గుణములున్ను లేనియెడల అల్పు లనబడుదురు.

సత్య ధర్మములను తప్పక, సోదరభావముతో మెలగుట లోనే హృదయశాంతి, లోకశాంతి, గృహములో గ్రామము లోను శాంతియు గలుగును.

## 15. నీ కష్టార్జిత సొమ్ముతోనే దానము చేయుము

స్వయముగా, న్యాయముగా శ్రమపడి సంపాదించి, మంచివారికి దానముచేసిన మాత్రమే తనకు పూర్తిగా దాన ఫలితము కలుగును.

తల్లిదండ్రాది బంధుమిత్రుల సొమ్ముతోగాని, ఇతరు లిచ్చిన సొమ్ముతోగాని, వడ్డీవ్యాపారముతోగాని, అద్దెల



వలనగాని, అధిక లాభమువేసికొని వ్యాపారముచేసిగాని సంపాదించి దాన ధర్మాది పుణ్యకార్యములను చేసినచో దాతకు పూర్తిగా పుణ్యము రాదు.

శ్లో. రాగా ద్యుపగతే చిత్తే, వంచయిత్వా పరంధనమ్
యదర్జ్యతే తస్య దానా, ద్యస్యార్థా స్తస్య తత్ఫలమ్।

తా. రాగద్వేషాది గుణములతో ఇతరులను మోస గించి సంపాదించిన ధనమును పుణ్యకార్యములకు ఉపయో గించినచో వానివలన వచ్చిన పుణ్యము ధనమునకు కర్త యైనవారికే చేరును. దానము చేసిన వానికి పుణ్యము రాదు. (యోగవాసిష్ఠము)

## 16. శ్రీ స్కాందపురాణము

(శ్లోకములను వదలి అందలి భావములనే వ్రాయుచున్నాను)

శ్రీ స్కాందపురాణమున ద్వితీయవైష్ణవఖండ మందలి గృహస్థాశ్రమధర్మనిరూపణ మను 22-వ అధ్యాయము.

శ్రీ నారాయణమూర్తి నారద మహర్షితో నిట్లు చెప్పెను :

1. పూర్వకాలములో తల్లిదండ్రులు తమ పుత్రులను విద్యాబుద్ధులను సంపాదించుకొనుటకుగాను గురువులవద్దకు పంపి విద్య పూర్తియగువరకును గురువుల దగ్గరనే యుంచెడి వారు. బ్రహ్మచారులుగానున్న తమ పుత్రులు వివాహము చేసికొనదలంచినచో గురువులకు దక్షిణలను సమర్పించుకొని గురువుల ఆజ్ఞనుబొంది తిరిగి యింటికి వచ్చెడివారు. తరువాత వీరి ధర్మ మేమన :

2. తన కులగౌరవములకు దగినట్టియు, వయస్సుచేత తక్కువదైనట్టియు, రోగము లేనట్టియు, పురుషలక్షణములు లేనట్టియు, పాపరహితయగు స్త్రీని శాస్త్రయుక్తముగా వివాహము చేసికొనవలయును.

3. తరువాత తన యధికారము ననుసరించి ప్రతిదినము నందును భగవత్సంప్రీతి కొఱకు దేవతలను, ఋషులను, పితృదేవతలను, భూతజాలములను పంచయజ్ఞాది కర్మలచేత సంతృప్తిపరుపవలయును.

4. స్నానమును, సంధ్యావందనమును, జపమును, హోమమును, అధ్యయనమును, విష్ణుపూజనమును, తర్పణమును, వైశ్వదేవమును అతిథిసత్కారమును ప్రతిదినమును, చేయవలయును.

5. న్యాయముగా నార్జింపబడిన ధనముతో శక్త్యనుసారముగా పుణ్యకార్యములను చేయవలయును. ఆశలేనివాడై తనను ఆశ్రయించినవారిని పోషింపవలయునే గాని వారలను పీడింపరాదు.

6. గృహస్థుడగువాడు అశాశ్వతమగు దేహమును, దేహసంబంధములగు క్రియలనుగురించి పశువులవలె యితరులతో వైరమును చేయరాదు. దేహ ధనాదులయందు నేను, నాది యను అహంకార, మమకారములను వదలవలెను.

7. జాగ్రతగలవాడై భగవద్భక్తులయొక్కయు, సత్పురుషులయొక్కయు సాంగత్యమును చేయవలయును. పరస్త్రీలయొక్కగాని, జూదము, పానము మొదలగు సప్తవ్యసనములుగల వారియొక్కగాని స్నేహమును చేయరాదు.



8. పరస్త్రీల నొకప్పుడును కాముకభావముతో జూడరాదు. శ్రాద్ధదినములయందును, పర్వదినములయందును, వ్రతదినములయందును, పగటియందును స్వభార్యతోనైనను విషయవర్జితుడై యుండవలయును.

9. పురుషుడు సాంఖ్యమునందును, యోగమునందును పరిపక్వజ్ఞానావస్థను పొందినవాడైనప్పటికిని ఏకాంతస్థలమునందు సొంత కుమార్తెతోనైన నుండరాదు. అట్లు సంభాషణాదులు గలిగియుండిన పతితుడగును.

10. ఇందువలననే తల్లితోగాని, సోదరితోగాని, కుమార్తెతోగాని బుద్ధిమంతుడగువాడు ఏకాంతముగా నుండరాదని జెప్పుచో నిక యువతియగు అన్యకాంతతో నుండరాదని వేరుగా జెప్పవలయునా?

11. మత్తును గలుగజేయునవియగు మద్యమాంసాదులను, జూదము మొదలగు సప్తవ్యసనములను దూరముగా త్యజింపవలయును. ఒకప్పుడును వాక్కుతోనైనను ప్రాణిమాత్రమునకు ద్రోహము జేయరాదు.

12. ప్రతిదినమును భగవంతునియొక్క అవతార రిత్రములను వినవలయును. దేవునియందు నమ్మిక వాడై తానుచేయు ప్రతికార్యమును భగవంతుని అకే యని చేయవలయును.

13. పాపములను హరింపజేయునవి యగు కార్తీక మాసమునందును, మాఘమాసమునందును, వైశాఖ మాసమునందును, చాతుర్మాస్యమునందును ఇంకను ఇతర పుణ్యకాలములయందును విధిప్రకారముగా విశేష నియమముల నాచరింపవలయును.

14. పుణ్యకాలములయందును, పుణ్యప్రదేశములయందును, మంచి హృదయము గలవారికి గృహస్థుడగువాడు విధిప్రకారముగా శక్త్యానుసారము దానము చేయవలెను. ప్రాణులయందు కరుణ గలిగి యుండవలెను.

15. పాపరహితుడవగునో నారదా! ధర్మవృద్ధికరములగు పుణ్యదేశములను, పుణ్యకాలములను, పుణ్యపాత్రులగు వారిని నీకు జెప్పుచున్నాను వినుము.

16. ఏదేశము నా చేత యధిష్ఠింప (నిర్మింప) బడినదో ఆ దేశము పుణ్యప్రదేశమని దెలిసికొనుము. మరియు మహావ్రత నియతులగు మును లేప్రదేశమున తపస్సు చేయుచుందురో అదియు పుణ్యస్థలమని యెఱుంగుము. భగవన్మాహాత్మ్యముచేతను, భగవద్భక్తుల మాహాత్మ్యముచేతను ఆ యా స్థలములకు పవిత్రత్వము గలుగుచున్నది.

17. తనకు సంబంధించినవారియొక్క (స్వ భార్య బిడ్డల యొక్క) మంచి సంస్కారము ఎపుడు లభించునో, సత్పాత్రులును (మంచి హృదయముగలవారు) ఎపుడు లభింతురో అవియే మిక్కిలి పుణ్యకాలములని చెప్పబడుచున్నవి.

18. దేవతలను, పితృదేవతలను, బ్రహ్మనిష్ఠులను, సత్పురుషులను శక్త్యానుసారముగా పూజించుటయు, స్నానము, దానము, జపము మొదలగునవియు అనంతమైన ఫలములను గలుగజేయునవిగా నున్నవి.

19. ఓయీ, నారదా! సత్పాత్ర మెటువంటి దనగా స్వయముగా సాక్షాద్భగవత్స్వరూప మనియే దెలియవలయును. చెట్టు మొదట బోసిన జలము ఎట్లు శాఖోప



శాఖాపత్రపుష్పాదులకు వ్యాపించునో, అట్లే భగవత్సమర్పితమగు సర్వమును భగవత్సంబంధు లందరికిని జేరుచున్నదని భావము.

20. అహింసావ్రతము, వేదాధ్యయనము, ఆచరణము, సద్ధర్మము, భక్తి వీటిచేత సంతోషించుచు ఎవరు హృదయమునందు భగవంతుని యెల్లప్పుడు నారాధించుచున్నారో అట్టి బ్రహ్మనిష్ఠులు సత్పాత్రులని చెప్పబడుచున్నారు.

21. ఏకాంతమునందుండువారును, భగవద్భక్తులును, సంసారబంధమునుండి విడివడిన వారును భగవత్స్వరూపులనియు, సత్పాత్రులనియు దెలియుము.

22. మనోవాక్కాయములచేత నేప్రాణికిని హింస చేయకుండుట యనునట్టి అహింసావ్రతముచేతనే అతి దయగలవారైన పితృదేవతలు సంతోషించుచున్నారు.

23. ఏ ధర్మముల ననుష్ఠించుటవలన మానవునకు అక్షయమగు అభీష్ట (కోరిక) సుఖము చేకూరునో, అట్టి యీ గృహస్థాశ్రమ ధర్మములను నీకు సంక్షేపముగా జెప్పితిని.

24. శిలాజీవికాది వృత్తిభేదములచేత ఆ యా నామము గలవారై గృహస్థులు నాలుగు విధములుగా జెప్పబడుచున్నారు.

## 17. మహానిర్వాణ తంత్రము

### అష్టమోల్లాసము

(మూలశ్లోకములను వదలి వాటి భావమునే వ్రాయుచున్నాను)

1. గృహస్థుడు భగవద్భక్తుడై యుండవలెను. భగవత్తత్త్వమును తెలిసికొనుటయే తన జీవిత పరమావధి.

కర్మఫలమం దాసక్తిలేనివాడై, ఈశ్వరార్పణబుద్ధితో కర్మముల నాచరించవలెను. కోరికలతో కర్మల చేయువారు దుఃఖముల నొందక తప్పదు.

2. ధనధాన్యములను సంపాదించుట గృహస్థుని ముఖ్య ధర్మ మగును. కాని అది కల్లలాడుటచేతను, పరులను మోసగించుటచేతను, పరధనములను దొంగిలించుటచేతను చేయతగదు. మరియు ఈశ్వర సేవయు, దరిద్రనారాయణ (దీనజన) సేవయు తన జీవిత ధర్మములని యాతడు గుర్తింపవలెను.

3. తల్లిదండ్రులు సాక్షాద్భగవత్స్వరూపులని గ్రహించి గృహస్థుడు ఎల్లపుడును అన్నివిధములను వారల సంతుష్టుల జేయవలయును.

4. ఎవ్వని తల్లిదండ్రులు సంతుష్టులో వానిచే భగవానుడు సంతుష్టుడగును. తల్లిదండ్రులకు కష్టము గలుగు మాటలను పలుకని బిడ్డలే నిజమైన బిడ్డ లగుదురు.

5. తల్లిదండ్రుల నెన్నడును పరిహాసము చేయరాదు. గర్వముగాని, కోపముగాని, ద్వేషముగాని చూపరాదు.

6. తల్లిదండ్రులయెదుట వినయవిధేయతలతో నిలువవలయును. కూర్చుండు మని చెప్పువరకు కూర్చుండరాదు.

7. తల్లికిని, తండ్రికిని, బిడ్డలకును, భార్యకును, పేదలకును బెట్టనిదే గృహస్థుడు భుజింపరాదు. అటుల భుజించుట పాపకార్యమే.

8. ఈ శరీరమునకు తల్లిదండ్రులే కారణభూతులు కావున వారలకు సంతోషము (మేలు) గలుగజేయుటకై మానవు డెన్ని కష్టములైనను భరించుట కర్తవ్యము.



9. తన భార్యయెడలను తన విధ్యుక్తధర్మము పైన తెలిపిన విధముగనే యుండవలెను. భార్య నాతడు దూషింపరాదు. కేవలము తల్లిగా భావించి యామెను పోషింపవలయును. తా నెంతటి మహాకష్టము ననుభవించుచున్నను భార్యపై కోపింపరాదు.

10. తన భార్యను తప్ప పరస్త్రీని తాకరాదు.

11. స్త్రీలతో చెడుమాట లాడరాదు. తన శక్తి సామర్థ్యములనుగూర్చి గొప్పగా చెప్పరాదు. నేను ఇది చేసితిని అది చేసితి నని చెప్పరాదు.

12. ధనముచేత, వస్త్రములచేత, ప్రేమచేత, నమ్మికచేత, చల్లని మాటలచేతను గృహస్థుడు తన భార్యను సంతుష్ట నొనర్పవలయును. ఆమె మనస్సునకు భయము, కష్టము కలుగు పని నెన్నడును చేయరాదు. పతివ్రతయగు భార్యయొక్క ప్రేమను బొందగల్గినవాడు సమస్త ధర్మముల ఫలము పొందినవా డగుచున్నాడు. సమస్త సద్గుణములను సంపాదించ గలుగుచున్నాడు.

13. బిడ్డలయెడ గృహస్థు డవలంబింపవలసిన ధర్మము లివి. నాలుగేండ్ల వయస్సు వచ్చువరకును పుత్రుని ప్రేమానురాగములతో బెంచుచు, పదునారేండ్లవరకును విద్యాబుద్ధులను గఱపవలయును.

14. ఇరువదియేండ్ల ప్రాయమున నాతని నేదియో యొక యుద్యోగమున లేక కృషి యందు నియోగింపజనును, తండ్రి యపు డాతని ప్రేమతో తన సమానునిగా జూడవలయును.

15. సరిగా నిదియే విధముగా కుమార్తెను పెంచి, విశేష శ్రద్ధతో నామెకు విద్యాబుద్ధులను గరపవలయును. వివాహ సమయమున తండ్రి యామెకు నగలను, ధనమును నొసగవలయును.

16. ఇక నాతనికి తన యన్నదమ్ములయెడ, అక్కచెల్లెండ్రయెడ, పేదలైయున్నయెడల వారి బిడ్డలయెడ, మిగిలిన తన బంధువర్గమునెడ, స్నేహితులయెడ, సేవకుల యెడ ప్రవర్తించవలసిన ధర్మములు గలవు.

17. పిమ్మట తన గ్రామవాసుల యెడలను, బీదల యెడలను, ఎవరైన గానిండు తన సాయమును కోరువారియెడలను గృహస్థునకు ధర్మము లేర్పడి యున్నవి.

18. తగినంత స్థితిపరుడై యుండియు గృహస్థుడు బంధువులకును, పేదలకును బెట్టనియెడల నట్టివాడు మానవమాత్రుడు గాడనియు, వట్టి పశువనియు గ్రహింపుడు.

19. వస్త్రాభరణములయందు, శరీరపోషణమునందు, తల దువ్వుకొనుటయందు వ్యామోహము కూడదు.

20. గృహస్థుడు పవిత్రహృదయుడై, పరిశుద్ధ శరీరుడై యుండుటయేగాక, పాపములు గలుగని కర్మల చేయుచుండవలయును.

21. శత్రువుల విషయమున గృహస్థుడు వీరుడై వర్తింప నొప్పును. శత్రువులకు లొంగక ఎదుర్కొనవలెను. ఇది గృహస్థుని విధి. అంతియేకాని యొక మూల గూర్చుండి యేడ్చుచు, తన యసమర్థతను చూపుచు అర్థరహిత ప్రలాపము లాడగూడదు. శత్రువులయెడ శౌర్యమును





ప్రకటింపని యెడల ఆతడు తన ధర్మమును నెఱవేర్పనివాడగును. గురువుల యెడలను, బందుగుల యెడలను ఆతడు మేకపిల్లవలె శాంతమూర్తియై మెలగవలయును.

22. దుర్మార్గులను గౌరవింపకుండుట గృహస్థుని విధ్యుక్తధర్మము. దుర్మార్గులయెడ గౌరవము చూపినచో దౌర్జన్యమును ప్రోత్సహించినవాడగును. మరియు గౌరవార్హులగు సజ్జనులను గౌరవించకపోయినచో తప్పుచేసినవాడగును. స్నేహమొనర్చుటలో మైమరచి సంచరింపరాదు. కనబడిన వారితోనెల్ల స్నేహము చేయుచు, తన నీతిధర్మమార్గమును విడువ తగదు. తాను స్నేహము చేయదలచిన వారి చర్యలను, పరులతో వారి వ్యవహారధర్మములను కనిపెట్టి వానిని గూర్చి పర్యాలోచించిన పిమ్మటనే వారితో స్నేహము చేయవలయును.

23. తన పేరు ప్రఖ్యాతులను గూర్చి నలువురియెదుట సంభాషింపరాదు, తన శక్తిసామర్థ్యములను గూర్చియు, తన సంపదను గూర్చియు లేక రహస్యముగా తనకు తెలుపబడిన విషయముల గూర్చియు ప్రసంగింపరాదు. ఈ మూడు విషయములను గూర్చియు గృహస్థుడు మాట్లాడరాదు.

తాను దరిద్రుడననిగాని, భాగ్యవంతుడననిగాని చెప్పరాదు. తన సిరిసంపదలనుగూర్చి ప్రగల్భములు పలుకరాదు. తన యభిప్రాయములను వెలిబుచ్చరాదు. ఇది యాతని పరమ ధర్మము.

24. ఏదైన పొరపాటు చేసినప్పుడుగాని, దౌర్బల్యమున కధీనుడైనప్పుడుగాని, నలువురియెదుట తన గుట్టు వెల్లడించుకొకూడదు. మరియు నేదేని యుద్యమము

నారంభించియుండునపుడు తన కందు జయము లభింపదని నిశ్చయముగా నెరిగియుండియు దానిని వెల్లడింపరాదు.

25. తన లోపమును తాను వెల్లడిచేయుట పిలువని పేరంట మగుట యేగాక, మనోదార్బల్య హేతువై జీవితమున విధ్యుక్తకర్మాచరణమునకు దన్నసమర్థుని జేయును. విద్యాధనముల నార్జించుటకై శక్తివంచనలేక ప్రయత్నించుట విధ్యుక్తము. తన విధిని నెరవేర్చనిచో ఆతడు గృహాసుడనిపించుకొన జాలడు. ధనార్జనమునకు గడంగని గృహాసుడు అధర్మవర్తను డగును.

26. అలసుడై పనికిమాలిన జీవితముతో తృప్తి వహించువాడు అవినీతిపరుడు. ఏలయన: తనపై వందల కొలదిమంది ఆధారపడియుందురు. ఆతడు ధనవంతుడైనచో తన్మూలమున వందలకొలది యితరులు సంరక్షింపబడుదురుగదా. సద్వినియోగమునకై ధన మార్జించుట తప్పుగాదు. అది పదిమందికుపయోగపడును. సంఘమునకు, సాంఘిక జీవనమునకును గృహస్థుడే ఆధారభూతుడు. ధర్మమార్గమున ధన మార్జించి, ఉదారబుద్ధితో దానిని వినియోగించుట ఆరాధనవంటిది. ఏలయన: సన్మార్గమున ధన మార్జింప, దానిని సత్కార్యములకై వినియోగింప ప్రయత్నించువాడు గుహలో ధ్యానమొనర్చు తపస్వియెట్టి మోక్షసాధన జేయుచున్నాడో, అట్టి మోక్షసాధనమే ప్రాయికముగా జేయుచున్నాడు. ఎట్లన: భగవద్భక్తిచే భగవంతునిదేయగు సమస్త సృష్టిజాలమునందలి భక్తిచే ప్రేరితమగు నాత్మార్పణము, స్వార్థత్యాగము నను సుగుణములే వీరిరువురియందును భిన్నవిధములుగా వ్యక్తమగుచున్నవి.



27. జనులకు మేలొనగూర్చుననియు, జనులకు ప్రీతికరములు నగు మాటల నుపయోగించుచు గృహస్థుడు మృదులమగు రీతిని సత్యసంభాషణ మొనర్పవలయును. పరుల వ్యాపారములను గూర్చి యాతడు పలుకరాదు.

28. చెఱువులను త్రవ్వించుచు, బాటల కిరువైపులను చెట్లను నాటించుచు, మానవులకును, జంతువులకును గూడ విశ్రాంతి మందిరములను నిర్మించుచు, బాటలను వేయించుచు, వంతెనలను గట్టించుచు గృహస్థుడు యోగీంద్ర లభ్యమగు నుత్తమోత్తమగతిని బొందుచున్నాడు.

29. స్వదేశము కొఱకుగాని, స్వధర్మము కొఱకుగాని యుద్ధరంగమున ప్రాణములను బాయు గృహస్థుడు ధ్యానముచే యోగి పొందు పరమపదమునే పొందుచున్నాడు. దీనివలన నొకని విధ్యుక్తధర్మము మరియొకనిది కాదనియు, ఐనను ఒకటి యుత్తమగతిని గల్గించునదియు, మరి యొకటి అధోగతిని గల్గించునదియు మాత్రము కాదనియు నేర్పడుచున్నది. మరియు ప్రతి విధికిని నియమిత స్థానము గలదనియు, మనయొక్క పరిస్థితుల ననుసరించి, మన ధర్మములను, విధులను నిర్వర్తించుచుండవలయు ననియు గ్రహించవలెను.

## 18. బ్రహ్మవిద్యాధికారము సన్న్యాసులకేనా? గృహస్థులకుకూడ గలదా?

సన్న్యాసులైనను, గృహస్థులైనను నిత్యానిత్య వస్తు వివేకము, ఇహపర సుఖములపై విరక్తి, మానసాదీంద్రియ

ముల నిగ్రహము, తీవ్ర ముముక్షుత్వమును కలవారికే బ్రహ్మవిద్యాధికారము గలదు. అహంకార, మమకారములు నశించినవారే లోకములో ముక్తులు. నిత్యమైన పరమాత్మను సత్యమైనదిగను, అనిత్యములైన దేహధనాది ప్రపంచమును అనిత్య (అసత్య) ములైనవిగను గాంచుటకు మొదట నభ్యసించవలెను. ఏ మానవుడైనను నశించు వాటిపై ఆసక్తిగలిగియున్నంతవరకు బాధలు అనుభవించక తప్పదు. సన్న్యాసులకైనను, సంసారులకైనను దేహాభిమానము నశించి అఖండాత్మానుభూతి గలిగిన శాశ్వతానందము గలుగును.

పూర్వము నుండియు సన్న్యాసులై, మోక్షసాధనలు చేసి ముక్తులైనవారు కనబడుచున్నారు. సంసారులుగా నుండియు (భార్యా బిడ్డలతో, భూ గృహ ధన పశువులతో నుండియు) మోక్షసాధనలు జేసి మోక్షపదము నొందినవారు కనబడుచున్నారు. ఋషులలో, దేవతలలో, రాజులలో, స్త్రీలలో ననేకులు బ్రహ్మజ్ఞానముగలవారు ఉన్నట్లు చరిత్ర వలన తెలియుచునేయున్నదిగదా! భద్రాచల రామదాసు, కబీరుదాసు, తులసీదాసు, పెద్దదాసు, త్యాగరాజు, పోతన, బ్రహ్మంగారు, సిద్దయ్యగారు, గురునానక్కు, మహమ్మదు, గాంధీ, శివాజీ, నామదేవుడు, తుకారామ్, ఏకనాథస్వామి, నరసింహమెహతా, జయదేవుడు, పుండరీకుడు మొదలగువా రెందరో గృహస్థాశ్రమములో నున్నను, పరమభక్తులై యున్నట్లు కలియుగములోని చరిత్రలు తెలియజేయుచున్నవి. పూర్వపు యుగములలో కూడ దంపతులుగా ఋషులు కలరు. భార్యా భర్తలిరువురు తపస్సంపన్నులుగ,



బ్రహ్మజ్ఞానులుగ, పరమభక్తులుగను, మహిమోపేతులుగను, లోకపావనులుగ నున్నపుడు పుట్టిన సంతానమున్ను పరిశుద్ధ హృదయులై పవిత్ర వర్తనగలవారుగా, కీర్తివంతులుగా ప్రకాశించగలరు.

వసిష్ఠుని భార్య అరుంధతీదేవి, శక్తిమహర్షి భార్య అదృశ్యంతీ దేవియును, చ్యవనమహర్షి భార్య సుకన్యా దేవిన్ని, పులస్త్యమహర్షి భార్య సంధ్యాదేవియును, అగస్త్య మహర్షి భార్య లోపాముద్రయున్నూ, భృగుమహర్షి భార్య పులోమయున్ను (ఖ్యాతి), జమదగ్నిమహర్షి భార్య రేణుకాదేవియును, విశ్వామిత్ర మహర్షి భార్య హైమవతీ దేవియును, నారదమహర్షి భార్య సత్యవతి (సుకుమారీదేవి), యాజ్ఞవల్క్య మహర్షి భార్య మైత్రేయి (కాత్యాయనియును) బ్రహ్మజ్ఞానముగల దంపతులే. ఇట్లే, దేవతలలోకూడ బ్రహ్మజ్ఞానముగల దంపతులు గలరు.

లక్ష్మీ నారాయణులు, సరస్వతీ బ్రహ్మలు, పార్వతీ పరమేశ్వరులు, శచీదేవి ఇంద్రులు, తారా బృహస్పతులు, ప్రభావతీ సూర్యులు, రోహిణీ చంద్రులు, ధూమోర్ణ యమధర్మరాజు, గౌరీ వరుణులు, ఋద్ధి కుబేరుడు, అదితి కశ్యపుడు, సీతా రాముడు, రుక్మిణి శ్రీకృష్ణుడు, ధృతి ధర్మదేవత, స్వాహాదేవి అగ్నిహోత్రుడు, గంగా సముద్రుడు—వీరందరు బ్రహ్మజ్ఞానము గలవారలే.

ఇట్లే, రాజులలో ఊర్వశీ పురూరవుడు, శకుంతలా దుష్యంతుడు, సావిత్రి సత్యవంతుడు, దమయంతి నలుడు, ధన్యాదేవి జనకమహారాజు, చూడాల శిఖధ్వజమహారాజు, సరమ్మ విభీషణుడు, ద్రౌపది పాండవులును, చంద్రమతి

హరిశ్చంద్రుడును గృహస్థులలో ఖ్యాతి గడించిన వారలే.

సంసారులకు సన్న్యాసులు గురువులుగా నుంటున్నారు. సన్న్యాసులకు గృహస్థులు గురువులుగా నుంటున్నారు. భర్తకు భార్య గురువుగా నుంటున్నట్లును, భార్యకు భర్త గురువుగా నుంటున్నట్లును చరిత్రలు కనబడుచున్నవి.

స్త్రీలకు పురుషులు గురువులుగా నుంటున్నట్లును, పురుషులకు స్త్రీలు గురువులుగా నుంటున్నట్లును కనబడుచున్నది. నచికేతుడను ఋషిపుత్రునకు యమధర్మరాజు వేదాంతమును బోధించెను. నారదునకు శివుడును, యాజ్ఞవల్క్యమహర్షికి సూర్యుడును, వ్యాసులవారికి నారదుడు బోధించెను. జనకమహారాజునకు వసిష్ఠుడు, యాజ్ఞవల్క్యుడు, పంచశిఖ మహర్షి, అష్టావక్రమహర్షి గురువులు.

శుకమహర్షికి జనకమహారాజు బోధించినట్లుగ, శ్రీరామునకు వసిష్ఠుడు, విశ్వామిత్రుడును బోధించిరి. శ్రీకృష్ణునకు సాందీపుడు, ఉపమన్యు మహర్షియును గురువులై బోధించిరి. గరుడునకు విష్ణువు, అర్జునునకు శ్రీకృష్ణుడును బోధించిరి.

శ్రీ రామకృష్ణ పరమహంసగారికి భైరవబ్రాహ్మణి, తోతాపురియును గురువులు. మెహర్ బాబాగారికి హాజరత్ బాబాజాన్ అను ఒక అమ్మగారును, ఉపాసన బాబాగారును గురువులు. గాంధీగారికి దాసి రామనామము నుపదేశించెను. శిఖిధ్వజ మహారాజునకు భార్యయగు చూడాలయే గురువు. గుణవతీబాయికి, ఆమె భర్తకును దాసియే గురువు. లీలాశుకునకు తాను ఉంచుకున్న చింతామణియే గురువు.



## జ్ఞానులలోని తరగతులు

(యోగవాసిష్ఠం నిర్వాణప్రకరణము నుండి 102 సర్గము)

శ్లో. కశ్చిద్గిరిగుహాగేహః కశ్చిత్పుణ్యాశ్రమాశ్రయః
కశ్చిత్ గృహస్థాశ్రమవాన్ కశ్చిద్బహురటస్థితః ।

శ్లో. కశ్చిద్భిక్షాచరాచారః కశ్చిదేకాంతతాపసః
కశ్చిత్ మౌనవ్రతధరః కశ్చిద్ధ్యానపరాయణః ॥

శ్లో. కశ్చిద్విపశ్చిద్విఖ్యాతః కశ్చిచ్ఛ్రోత్రితా శ్రుతేః స్మృతేః
కశ్చిద్రాజాద్విజః కశ్చిత్కశ్చిదజ్ఞ ఇవ స్థితః ॥

శ్లో. గుటికాంజన ఖడ్గాది సిద్ధః కశ్చిన్నభోగతః
కశ్చిచ్ఛిల్పకలాజీవి కశ్చిత్పామరరూపభృత్ ॥

శ్లో. కశ్చిత్త్యక్త సమాచారః కశ్చిచ్ఛ్రోత్రియ నాయకః
కశ్చిదున్మత్తచరితః ప్రవ్రజ్యాం కశ్చిదాశ్రితః ॥

తా. జ్ఞానులలో నొకడు పర్వతగుహాలందును. మరియొకడు పుణ్యాశ్రమములందు నివసించుచుండును. వేరొకడు గృహస్థాశ్రమమం దుండును.

ఇంకొకడు ఎక్కువగా సంచారము సల్పుచుండును. ఒకడు భిక్షాటన మాచరించువాడుగను, ఒక డేకాంతమునందు తపస్సుచేయువాడుగను, ఒకడు మౌనవ్రతమును ఆచరించువాడుగను, మరియొకడు ధ్యానపరాయణుడుగను నుంటున్నాడు.

ఒకడు విఖ్యాత పండితుడుగను, ఇంకొకడు శ్రుతిస్మృతులను శ్రవణముచేయువాడుగను, మరొకడు రాజుగను, ఇంకొకడు బ్రాహ్మణునివలెను, ఒకడు అజ్ఞానివలె నొప్పారుచుండును.

గుటిక, అంజన, ఖడ్గాదులచే ఒకడు ఆకాశగమనాది సిద్ధులబొందువాడుగను, ఒకడు శిల్పకళచే జీవిక నిర్వహించుకొనువాడుగను, ఒకడు పామరునివలె రూపము ధరించినవాడుగను, ఒకడు ఆచారముల నన్నింటిని విడిచిన వాడుగను, ఇంకొకడు వేదవేత్తలలో నగ్రగణ్యుడుగను, వేరొకడు పిచ్చివానివలె వ్యవహరించువాడుగను, మరియొకడు సన్న్యాసమును గ్రహించినవాడుగను నుంటున్నాడు.

మోక్షమునకు ఆత్మజ్ఞాన మొక్కటే ప్రధానమైనది. వేషభాషలు, క్రియాక్రియలు, వర్ణాశ్రమ భేదములున్ను ప్రధానములుగావు. చదువులేని స్త్రీ, పురుషులలో గూడ ఆత్మజ్ఞానులు గలరు.

## 19. తల్లిదండ్రు లెవరు ? బిడ్డ లెవరు ?

శ్లో. ఋణానుబంధ రూపేణ, పశుపత్నీసుతాలయః
ఋణక్షయే వినశ్యంతి కాతత్ర పరిదేవనా॥

తా. ఋణముండుటవలననే భార్యాభర్తల సంబంధము, బిడ్డలతో, పశువులతో, భూములతో, గృహములతో ధనాదివస్తువులతోను సంబంధమునుగలిగి సుఖదుఃఖాదులను మానవులు అనుభవించుచుందురు. ఋణము తీరిన వెంటనే సంబంధములు వీడిపోవును, కనుక ఆశ్చర్యపడ గూడదు, దుఃఖపడకూడదు.

శ్లో. యా మాతా సా పునర్భార్యా యా భార్యామాతృకైవహి
యః పితా స పునః పుత్రో యః పుత్రో స పునః పితా॥



తా. పూర్వజన్మమున తల్లిగాయున్న స్త్రీయే, ఈజన్మమున భార్యయగును. ఇట్లే, పూర్వజన్మమున భార్యగాయున్న స్త్రీయే ఈజన్మమున తల్లి యగును.

ఇట్లే, పూర్వజన్మమున తండ్రిగాయున్న పురుషుడే ఈజన్మమున కుమారు డగును. ఇట్లే బిడ్డయే మరల తండ్రి యగును.

( యోగతత్త్వోపనిషత్తు )

పై జెప్పబడిన సంసారచక్రమునుండి (బంధమునుండి) విడివడుటకు బ్రహ్మజ్ఞానసాధనయే గతియగును.

లోకములో భార్యను చంపునట్టి భర్తను, భర్తను చంపునట్టి భార్యను చూచుచున్నాము. ఇట్లే, తల్లిదండ్రులను చంపినట్టి బిడ్డలను, బిడ్డలను చంపినట్టి తల్లిదండ్రులను చూచుచున్నాము. ఇట్లే, సోదరుని చంపినట్టి అన్నను. అన్నను చంపినట్టి సోదరులను చూచుచున్నాము. ఇట్లే, గురువును చంపినట్టి శిష్యుని, శిష్యుని చంపినట్టి గురువును చూచుచున్నాము.

ఋణస్థులు, శత్రువులున్ను బిడ్డలుగా పుట్టి బాధపెట్టుచుందురు.

ఒకప్పుడు పార్వతీదేవికి శ్రీకృష్ణుడు కుమారుడుగా (గణేశుడుగా) పుట్టెను. ద్వాపరయుగములో పార్వతీదేవి శ్రీకృష్ణునకు భార్యగా (జాంబవతిగా) నయ్యెను.

హిరణ్యకశిపునకు పూర్వజన్మమున శత్రువులుగానున్న సనకాదియోగులే ప్రహ్లాదుడుగా బుట్టి (పుత్రుడుగా పుట్టి) తండ్రియగు హిరణ్యకశిపుని శ్రీహరిచే చంపించెను.

రావణాసురుని శత్రువే తమ్ముడై (విభీషణుడై) శ్రీరామునికి మర్మములు చెప్పి చంపించెను.

శ్రీ బుద్ధదేవునికి శిష్యుడే మందు పెట్టి బుద్ధుని చంపెను.

శ్రీ క్రీస్తుదేవుని తన శిష్యుడే శత్రువులకు వప్పచెప్పి చంపించెను.

శ్రీ దయానంద మహర్షిని (ఆర్యమత స్థాపకుని) ఒక వేశ్య విషము పెట్టించి చంపించెను.

శ్రీ రామానుజాచార్యులను తన గురువే చంపుటకు ప్రయత్నించి విఫలుడయ్యెను.

ఒక సాధుపుంగవుడు ప్రయాగక్షేత్రమునకు వెళ్లి సాధు సమారాధన చేయదలచినవాడై మధురనుండి బయలుదేరి పోవుచు ఒక గ్రామములోని వైశ్యుని యింటికి వెళ్లి భోజనముచేసి పరుండెను. అపుడు కోమటి సాధువుగారి ధనమును తీసికొని వాని మూటలో రాళ్లనువేసి కట్టెను. సాధుపుంగవుడు నిద్రనుండి లేచి ప్రయాణమై పోవుచు ప్రయాగకు చేరి సాధు సమారాధన చేయుటకు ధనపు సంచిని విప్పి చూడగా రాళ్లు మాత్రమే గలవు. కొంతసేపు గాఢ చింతలో మునిగి సాధుపుంగవుడు గంగలో తన శరీరమును విడిచి వైశ్యునకు కుమారుడుగా పుట్టి, పెరిగి పెద్దవాడై ఒకనాడు తల్లిదండ్రాదులతో ప్రయాగక్షేత్రమునకు బయలుదేరి వెళ్లి పూర్వపు ధనముకంటె రెట్టింపు ధనమును ఖర్చుపెట్టించి తన పూర్వపు వృత్తాంతమును తల్లిదండ్రాదులకు చెప్పి జబ్బుగానున్నదని చెప్పి ప్రాణమును వదలి తల్లిదండ్రాదులను దుఃఖసాగరములో ముంచివైచెను.



ఒక బ్రాహ్మణుడు తన భార్య ప్రసవించిన వెంటనే బిడ్డను శ్మశానమునకు తీసికొనివెళ్లి గోతిలోనుంచి అక్షతలు జల్లి, "నీ వెవ్వరవు ? నా కెందుకు పుట్టితివి ?" అని యడిగెను. అపు డా శిశువు, "నేను పూర్వజన్మమున కత్తులమ్ముకొని బ్రతుకువాడను. నా మోపు నీవు వేయించుకొని దాని వెల యివ్వకపోతివి. ఆ వెలను రాబట్టుకొనుటకై నీకు పుట్టితిని" అని చెప్పెను. మరియు "ఆ వెల నిచ్చినచో పోయెద"నని చెప్పగా, ఆ బ్రాహ్మణుడు ఆ వెల ఆ శిశువుపై నుంచగా శిశువు ప్రాణమును విడిచెను. దానిపై బ్రాహ్మణుడు మన్ను వేసి, పూడ్చివేసి ఇంటికి వచ్చెను.

## 20. శ్రీ శుకుడు కర్మఫలము గూర్చి పరీక్షిత్తునకు జెప్పుట

పరీక్షిత్తు : మహాత్మా! పురుషు లెట్లు స్త్రీలై జన్మింతురు ?

శుకుడు : రాజేంద్రా! పురుషుడు స్త్రీని చంపినను, కారణములేక స్త్రీని కొట్టి, దుఃఖపెట్టి బాధించినను ఆ పురుషుడు స్త్రీయై పుట్టి అనేక దుఃఖములను, బాధలను, నరకమును అనుభవించును.

పరీక్షిత్తు : ఏ పాపము చేసిన మానవులు గ్రుడ్డివారగుదురు ?

శుకుడు : చూచినది లేదనువారు గ్రుడ్డివారగుదురు. వారు యమునివలన చాల బాధల నొందెదరు.

పరీక్షిత్తు : ఎట్టివారి తల నరుకబడును ?

శుకుడు : గురువులను కొట్టినవారి తల నరుకబడును. వారు నరకబాధల నొందెదరు.

పరీక్షిత్తు : ఎట్టివారు కుంటివారు అగుదురు ?

శుకుడు : తనకంటె పెద్దవారిని కొట్టువారు, తన్నువారును కుంటివారగుదురు. వారు యమయాతనల బొందుదురు. నీచ కులమున దరిద్రుల యింట కుంటివారుగ పుట్టెదరు.

పరీక్షిత్తు : చెవిటి వారెవరగుదురు ?

శుకుడు : పండితుని వలన శాస్త్రములుగాని, పురాణములుగాని విని, వానికి తగిన సత్కారము చేయనివారు చెవిటి వారగుదురు. ఆశాభంగము చేయువారు (యిచ్చెదనని చెప్పియు ఇవ్వకున్నవారు) చండాలు రగుదురు.

పరీక్షిత్తు : ఎట్టివారు నపుంసకులగుదురు ?

శుకుడు : గురుపత్నీహరణముచేయువారు యమబాధలుపడి నపుంసకులుగా, కుష్ఠురోగులుగా పుట్టుదురు. వారి భార్యలు పరపురుషులతో విహరింతురు.

పరీక్షిత్తు : మనుజునికి పశుజన్మ మెట్లు గలుగును ? వారనుభవించు పాప మెట్టిది ?

శుకుడు : తనకంటె వయస్సులో పెద్దదైన స్త్రీతోను, తల్లిదండ్రుల తోబుట్టువులతోను, అత్తగారు, వదినెగారు, మేనగోడలు మొదలగువారితోను కూడినవారు చనిపోయిన తరువాత నరకబాధల నొంది తుదకు మేకజన్మమునొందెదరు.

పరీక్షిత్తు : చిన్నవయస్సులో బిడ్డలు చనిపోవుటకు కారణమేది !



శుకుడు : పరుల హింసించుట, వారికి ఆపదలు కలిగించుట, కలహములు పెట్టుట—వీనివలన ప్రజలు చిన్న వయస్సులో చనిపోవుదురు.

పరీక్షిత్తు : సంతానము కలుగకుండుటకు కారణమేది ?

శుకుడు : ఎద్దులు మొదలగు జంతువుల బీజమును (వృషణముల) కోసి, పిచ్చలు తీయువారు గొడ్డుబోతులగుదురు.

పరీక్షిత్తు : కత్తి వేటునను, పాము కాటునను, పిడుగు పాటునను, పులి, మొసలి మొదలగు క్రూరజంతువుల వాతనుబడి హఠాత్తుగా చత్తురుగదా ! అట్టి చావెందువలన ప్రాప్తించును ?

శుకుడు : అట్టి చావులకే అకాలమరణ మందురు. వారు చేసిన పాపమువలననే అట్టి మరణములు గలుగును. వారు యమబాధ లనుభవించి, పురుగులై పుట్టుదురు.

పరీక్షిత్తు : దొంగతనముచేయువారికి యము డెట్లు బాధలు గలిగింపజేయును ?

శుకుడు : దొంగలను యమదూతలు ఇనుప రోకండ్లతో కొట్టుదురు. కత్తితో కోయుదురు. భూలోకములో పశువులుగా పుట్టింపజేయుదురు.

పరస్త్రీని చెరచువారు బుడ్డలు, బూరగాళ్లు గలవారై తమ భార్యలే ఇతరులతో బోవుచుండగ జూచి ఏమి[illegible] చేయలేక ఊరకుండి చచ్చిన పిమ్మట నరక మనుభవింతు[illegible].

పురుషునితో సంచరించుచు భర్తకు సేవచేయని [illegible] చచ్చి అనేక నరకబాధలుపొంది తుదకు ఆడు గుఱ్ఱ[illegible] పుట్టును.

మగనితో పోరాడుచుండువారును, వానిని కొట్టు వారును, తిట్టువారును యమదూతలచే అగ్నిగుండములో పడవేయబడుదురు. యమదూతలు అట్టి స్త్రీలయొక్క చెవులలో, ముక్కులలోను మరుగుచున్న నూనె పోయుదురు. అట్టివారు నరకబాధ లనుభవించినతరువాత మాలవాని యింట జన్మింతురు.

పరీక్షిత్తు : భార్యా భర్తల సంబంధ మెన్ని జన్మలవరకుండును.

శుకుడు : పుణ్యవిశేషమువలన స్త్రీ పురుషజన్మ మెత్తినపుడు, పాపదోషమువలన పురుషుడు స్త్రీయై జన్మించినపుడును భార్యాభర్తల సంబంధము వీడిపోవును. మరియు శాపమువలనకూడ భార్యాభర్తల సంబంధము వీడిపోవును. సన్యాసాశ్రమమును స్వీకరించిన కుమారుడు తల్లికి నమస్కారము చేసినచో మరుజన్మమున తల్లి పురుషుడై జన్మించి మోక్షమార్గము నవలంబించును.

సరస్సులలో గల ప్రభావమువలన ఒక్కొక్క సరస్సులో స్నానముచేయుటవలన కూడ పురుషుడు స్త్రీ యగును.

( విష్ణు పురాణము )

## 21. సంసారులు సుఖవంతులా ? సన్న్యాసులు సుఖవంతులా ?

''సుఖం బ్రహ్మ జగ ద్దుఃఖమ్'' అనగా బ్రహ్మము ( ఆత్మ ) సుఖస్వరూప మనబడును, జగత్తు ( దేహము ) దుఃఖ



స్వరూప మనబడును, గాన సంసారులైనను, సన్న్యాసులైనను నిత్య వస్తువగు ఆత్మను, దైవమును నమ్మియున్న మాత్రమే సుఖముగా నుందురు. అనిత్యమైన జగమును, దేహమును, సంసారమును నమ్మియుండువారు దుఃఖపడుచునే యుందురు.

అహంకార, మమకారములే దుఃఖకారణము లనబడును.

అహంకారమును త్యజించుట ఆంతర వైరాగ్య మనబడును. మమకారమును వదలుట బాహ్య వైరాగ్య మనబడును.

కారణ మగు మన్నుకంటె, వేరుగా కార్యములగు కుండలు లేనట్లును, బంగారముకంటె నగలు వేరుగా లేనట్లును, దూదికంటె వేరుగా వస్త్రములు లేనట్లును, కారణ మగు పరమాత్మకంటె వేరుగా కార్యమగు జగము, సంసారము, దేహము లేదు.

నాది యనుకొనుట సంసార బంధ మనబడును. దేవుని దనుకొనుట భక్తి యనబడును. దైవస్వరూపమే సర్వము ననుకొనుట జ్ఞాన మనబడును.

సర్వము దేవునిదే. సర్వము దైవస్వరూపమే యైనప్పటికిని నా దేహము, నా గృహము, నా ధనధాన్యములు, నా భూములు, నా బంధుమిత్రాదులు యను భావములతో సంసారులలో ననేకులు బాధలు పడుచున్నారు. ఇట్లే, సన్న్యాసులలో ననేకులు నా దేహము, నా మఠము, నా ధనము, నా శిష్యులు యను భావములతో బాధలు పడుచున్నారు.

శాశ్వతమైన పరమాత్మను మరచి అనిత్యములైన వాటిని నమ్మియున్నవారిలో, బాధలు కాపురము చేయుచుండును.

తే. గీ. రేపు దొరకెడి మత్త బర్హిణముకన్న
నపుడె దొరకెడి పావుర మధిక లాభ
మనుచు నైహికానందము నంద బుద్ధి
చొనిపి చెడుదురు పరలోకమునకు జడులు.

రేపు లభించెడి అందమైన నెమలి కంటె, యిప్పుడే లభించెడి పావురము మేలు అన్నట్లు అవివేకులు, వైరాగ్యముచే లభించెడి పరమాత్మ సుఖమునకు పాటుపడక క్షణికములు, అశాశ్వతములు, దుఃఖకారణములు నైన ఇంద్రియ విషయ సుఖములకు బానిసలై చెడిపోవుచున్నారు,

మోక్ష మార్గము మొదట మిక్కిలి కష్టమైనదిగా నుండి పిదప అనంతమైన విశాల మగును. అజ్ఞాన మార్గము మొదట విశాలముగా కనబడుచు, పిదప బహు ఇరుకుగా దుఃఖముగా పరిణమించును. అందువలననే లోకములో నూటికి తొంభై తొమ్మిది మంది అజ్ఞాన మార్గమున నడచుటకే యిచ్ఛగించుచున్నారు.

జ్ఞాన మనగా, దేశమును వదలి దూరముగాపోవుట కాదు, లోకమును మరచి మొద్దువలె నుండుటయు గాదు. నిత్యమైన ఆత్మను నిత్యమైనదిగాను, అనిత్యములైన దేహ ధనాది నామ రూపములను అనిత్యములైనవిగాను చూచుచు వ్యవహరించుట యగును.





ఆత్మను, దైవమును మరచినవారే కష్టముల పాలగుదురు.

గృహస్థాశ్రమములో నుండియు ననేకులు ఆత్మజ్ఞానముతో నిస్సంగులై వర్తించుచున్నారు. సన్న్యాసాశ్రమమును స్వీకరించియు ననేకులు ఆత్మయందుగాని, దేవుని యందుగాని దృఢవిశ్వాసము లేనివారై, వాచా వేదాంతులై, కామ క్రోధ లోభ మోహాది గుణములలో చిక్కి బాధలు పడుచున్నారు.

ఆత్మకు దాసులుకాక, అనాత్మకు దాసులైన వారికి సుఖమేమియు నుండదు.

కామమునకు, ధనమునకు, కీర్తికి, జిహ్వా రుచులకును లోబడువారికి ఆత్మస్వరూపజ్ఞానము అనుభవములో నుండదు.

సుకృత బలము, సద్గురు కృప, దేవుని అనుగ్రహమును ప్రతి ముముక్షువును సంపాదించుకొని యుండవలెను.

సన్న్యాసిగా నుండియు బంధములో నున్న శుకునకు, గృహస్థాశ్రమములో నుండియు ముక్తుడైయున్న జనక మహారాజు చెప్పిన దివ్యవాక్యముల నిచట తెలిపెదను.

శ్లో. పితృస్సంగం పరిత్యజ్య । త్వం వనం గంతు మిచ్ఛసి
మృగై స్సహాను సంబంధో । భవితా తేన సంశయః॥

తా. నీ తండ్రియగు వ్యాసులవారిని వదలి, వనమునకు నీవు వెళ్లదలంచితివిగదా! ఆ వనమునందు మృగముల సాంగత్యము గలుగుచున్నదిగదా! అపు డేమి చేయగలవు!

శ్లో. మహాభూతాని సర్వత్ర । నిస్సంగః కథమిష్యసి
ఆహారార్థం సదా చింతా । నిశ్చింతాస్యాః కదా మునే॥

తా. ఒకవేళ ఆవనమును కూడ విడిచి ఎచటికైనను పోదలంచినను, అన్నిచోట్లను మహాభూతములచే నిండి యుండగా నిస్సంగత్వ మెట్లు గలుగును? మరియు గృహము నందువలె ఆహారచింత యుండునుగదా! నిస్సంగత్వ మెట్లు గలుగును?

శ్లో. దండాజిన కృతాచింతా। యథాతవ వనేపి చ
తథైవ రాజ్యచింతామే। చింతయానస్యవా నవా॥

తా. నీ దండ కమండల కృష్ణాజినములను కాపాడు కొనవలెనను చింత అడవిలోనున్నను నీకుండునుగదా! అట్లే నేను గృహములోనుండి రాజ్యమును (ప్రజలను) కాపాడుకొనవలెనను చింతతో నుందును. ఇక నీకును, నాకును భేదమేమి కలదు?

శ్లో. వికల్పోపహత స్త్వంవై। దూరదేశ ముపాగతః
న మే వికల్ప సందేహో। నిర్వికల్పోస్మి సర్వదా॥

తా. నీవు సందేహములతో గూడిన మనస్సుగల వాడవై యుండుటచే గ్రామమును వదలి దూరదేశమునకు (వనమునకు) పోయి యవస్థపడుచున్నావు. నా కన్నియట్టి సందేహము ఏమియులేదు గనుక నగరమందే (గృహమునందే) యుండి సుఖంచుచున్నాను.

శ్లో. సుఖం స్వపి మివిప్రాహం। సుఖం భుంజామి సర్వదా
న బద్ధోస్మీతి బుద్ధ్యాహం। సర్వదైవ సుఖీ మునే।

తా. నేను సుఖముగా నిద్రించుచున్నాను. సుఖముగా భోజనము చేయుచున్నాను. నేను బద్ధుడనుగాను అని యెడు నమ్మకముగలవాడను గాన నే నెప్పుడును సుఖమునే యనుభవించుచున్నాను. ఇక నీవో.



శ్లో. త్వంతు దుఃఖి సదైవాసీ। బద్ధాహ మితి శంకయా
ఇతి శంకాం పరిత్యజ్య। సుఖీభవ సమాహితః.

తా. నీవు బద్ధుడవై యున్నట్లు సందేహించుచున్నావు. కనుక సదా దుఃఖమునే యనుభవించుచున్నావు. కనుక సంశయమును విడిచిన యెడల సుఖపడగలవు.

శ్లో. దేహోయం మమ బంధోయం। నమ మేతిచ ముక్తతా
తథా ధనం గృహం రాజ్యం। నమమేతి చ నిశ్చయః॥

తా. ఓ శుకమహర్షీ! ఈ దేహము నాది యనుకొనుటయే బంధహేతువు. నాది కాదు అనుకొనుటయే బంధవిముక్తి యనబడును. కనుక నేను ఈ దేహముగాని, ఈ ధనముగాని, ఈ గృహముగాని, ఈ రాజ్యముగాని నాది కాదనియెడు నిశ్చయముగలవాడనై యున్నాను అని జనకమహారాజు, శుకమహర్షితో చెప్పెను.

కథ : ఒక సన్న్యాసి వర్షాకాలమున ఒకనాడు సాయంకాలమునకు ఒక గ్రామము జేరెను. అచట దేవాలయముగాని, బ్రాహ్మణ గృహముగాని కనబడలేదు. వర్షము విశేషముగా కురియుచున్నది. ఆకలిబాధ తీవ్రముగా నుండెను. ఒక కాపువాని పంచనగల అరుగుపై కూర్చొనవలసి వచ్చెను.

కాపువాడు వర్షములో తడియుచు పశువులను తోలుకొని ఇంటికి వచ్చి పశువులను ఇంటి ముందర చావడిలో కట్టివేయుచు పేడ, చెత్తను తీసివేసి శుభ్రపరచి పశువులను తుడిచి, కుడితి పానీయంబుల ద్రాగించి, దోమల బాధ తొలగుటకు పొగవేసి, గడ్డివేసెను. దీని నంతను సన్న్యాసి చూచి, "ఆహా! గృహస్థుడగుటచేతనేగదా, వీడు యింత కష్టపడవలసిన దుస్థితి పట్టినది. సన్న్యాసిగాయున్న నాకు

ఆ బాధలేవియు లేవుగదా” యనుకొని ఆ కాపువాడు వినునట్లుగా, “ సంసారీ కష్టీ, సన్న్యాసీ సుఖీ ” యనెను.

తరువాత కాపువాడు స్నానము చేయుటకు ఇంటి యావరణలోనికి వెళ్లగానే అతని భార్య వేడినీటిని తీసికొని వచ్చి భర్తను స్నానము చేయించుచు, భర్త దేహమును పరిశుభ్రముగా తోమి స్నానము చేయించిన తరువాత చలవ పొడి వస్త్రముల గట్ట నిచ్చి, కట్టుకొని వచ్చిన పిమ్మట వానికి షడ్రసోపేతముగా నుష్ణాన్నమును వడ్డించెను. వా డా యన్నమును తృప్తిగ భుజించి తాంబూలము వేసికొని భార్యచే సమర్పబడిన మృదుశయ్యాపై బవ్వళించెను. ఇవి యన్నియు గూడ చూచుచుండిన ఈ సన్న్యాసి, ఆహా! ఈ సంసారి కొంచెముసేపు కష్టపడినను యిపుడు గొప్పగా భోగము లనుభవించుచున్నాడనియు, తన కట్టి భోగము లెట్లు కలుగ గల వనియు నెంచి, “సన్న్యాసీ కష్టీ, సంసారీ సుఖీ” యని మరల బిగ్గరగ ననెను. ఈ రెండు మాటలను రెండు మార్లు వినిన యా కాపువా డా సన్న్యాసినిచూచి “అయ్యా! మీ రిట్లు రెండు పర్యాయములు రెండు విధములుగ చెప్పుటకు కారణ మేమి ?” యని అడిగెను. అపుడా సన్న్యాసి తన యావత్తు విషయములను చెప్పి, “ నేను మిక్కిలి ఆకలితో బాధపడు చున్నా”నని చెప్పెను. అపుడా కాపువాడు కనికరించి చిక్కని వేడిపాలను తీసికొనివచ్చి తృప్తికరముగ త్రాగ నిచ్చెను. క్షుద్బాధ తీరినందున సన్న్యాసి సుఖముగ నిద్రించెను. ఈ కథవలన ద్వంద్వములకు చలించువాడు, ఆత్మసుఖముపై స్థిరనమ్మకము లేనివాడు సన్న్యాసాశ్రమ స్వీకారమునకు అధికారి కా డని తెలియుచున్నదిగదా!



ఆసక్తిగలవారు బాధలు పడుట తప్పదు. ఆసక్తి లేని వారు సుఖముగా తిరుగుదురు. పనుల జేయుదురు. సుఖముగా నిద్రించెదరు.

“ రాగో లింగ మబోధస్య ” జ్ఞానము లేని వారికి కోరిక లుండుటయే గుర్తు. జ్ఞానులకు కోరిక లుండవు.

ఆశయే సంసారము. నిరాశయే సన్న్యాసము.

ఉ. దానము ధర్మమున్ జపము తర్పణముల్ శుచివృత్తి స్నాన సం
ధ్యా నియమంబు లెన్నియయినం బొనరింపఁగవచ్చుగాని వి
ద్యానిధులైన యోగయుతులైన మహామునులైన జన్మలో
మానస మంటియున్న యభిమానము వీడగ లేరు ధారుణిన్.

శ్లో. ధనవృద్ధా వయోవృద్ధా । విద్యావృద్ధా స్తథైవ చ
తే సర్వే జ్ఞానవృద్ధస్య । కింకరాః శిష్యకింకరాః.

తా. లోకములో కొందరు ధనముచే వృద్ధులు, కొందరు వయస్సుచే వృద్ధులు, కొందరు విద్యచే వృద్ధులు నుందురు. వీ రందరున్ను జ్ఞానవృద్ధుల శిష్యులకును కింకరు లగుదురు అని సన్న్యాసులు చెప్పుచుందురు.

శ్లో. జ్ఞానవృద్ధా స్తపోవృద్ధా । వయోవృద్ధా స్తథాపరే
తే సర్వే ధనవృద్ధస్య । ద్వారే తిష్ఠంతి కింకరాః.

తా. లోకములో కొందరు జ్ఞానవృద్ధులు కలరు, కొందరు తపోవృద్ధులు కలరు. కొందరు వయోవృద్ధులు కలరు. వీ రందరున్ను ధనవృద్ధునియొక్క గృహద్వారము

దగ్గర కింకరులుగా నివసించుచున్నారు అని సంసారులు చెప్పుచున్నారు.

"నిరాశీ పరమం సుఖీ"

లోకములో ఏవిధమైన ఆశ (కోరిక) లేనివాడే, పరమ సుఖి యనబడును.

## 22. శ్రీ జనకమహారాజు చరిత్ర

### యోగవాసిష్ఠము నుండి

ఆపదలు లేనివాడును, వృద్ధిబొందిన సమస్తసంపదలు గలవాడును, ఉత్తమ బుద్ధిశాలియు, విదేహదేశంబునకు నధిపతియు నగు జనకు డను ఒకరాజు గలడు.

యాచకులకు కల్పవృక్షమువంటివాడును, మిత్రులకు కమలములకు సూర్యునిబోలువాడును అగు ఆ జనకమహారాజు ఒకప్పుడు మదించిన కోయిలలయొక్క పలుకులచే రమణీయంబగు వసంతఋతువునందు ఇంద్రుడు నందనవనమునకు బోయినట్లు మనోహరంబగు నుద్యానవనమునకు బోయెను.

అట్లు పోయి యారాజు నానావిధములగు పుష్పముల యొక్క పుష్పాదులచే పరిమళించుచున్న యా యుద్యానవనమునందు భటులను దూరముననుంచి పొదలయందు విహరించుచుండెను.

అంతట నారాజు ఒకానొక చీకటిమ్రాకుల పొదయందు ఉండి పర్వతగుహాలయందు దిరుగునట్టి విజన (ఏకాంత) వాసులగు సిద్ధులచే ప్రసంగవశమున చెప్పబడినట్టియు, ఆత్మభావనతో గూడినట్టియు ఈ వచనములను వినినవాడాయెను.



### సిద్ధవచనములు

మొదటి సిద్ధు డిట్లనెను :

చూచునట్టి పురుషుడు రమ్యమగు వస్తువును చూడగా బుద్ధియందు ఏ యానందము కలుగుచున్నదో అట్టి జీవునకు బ్రహ్మాత్వముచే గలిగిన యానంద మేదిగలదో ఆ యానంద స్వరూపుడును, నిశ్చలుండును నగు నాత్మను భావించుచున్నాము.

2-వ సిద్ధు డిట్లనెను :

చూచువాడు, చూపు, చూడబడునట్టివస్తువు అనునీ మూటిని వాని వాని వాసనలతోడ విడిచి, చూపుకంటె మొదట ప్రకాశించుచు తన కాంతిచే సర్వమును ప్రకాశింప జేయునట్టి యాత్మను ఉపాసించుచున్నాము.

3-వ సిద్ధు డిట్లనెను :

కలదు, లేదు అనునట్టి రెండు పక్షములకు మధ్యమున నున్నట్టియు (అనగా సద్రూపముగాన కలదు; నిరాకారముగాన లేదు అని రెండు పక్షములయందును సమానమైనదనుట), సూర్యచంద్రాది జ్యోతిస్సులను ప్రకాశింప జేయునట్టియు ఆత్మను ఉపాసించుచున్నాము.

4-వ సిద్ధు డిట్లనెను :

దేవతలు, మనుజులు, తిర్యగ్జంతువులు మొదలగు సమస్త ప్రాణిశరీరములయందు నున్నట్టియు, సకారము అంత

మందును, హాకారము ఆదియందును గల హంసమంత్రమును ఎప్పుడు నుచ్చరించుచుండునట్టి యాత్మను ఉపాసించుచున్నాము.

5-వ సిద్ధు డిట్లనెను :

ఈ నామరూప ప్రపంచము ఎవనియందు గలదో, ఇ దంతయు నెవనిదో, ఈ సమస్తప్రపంచమును పుట్టించిన దెవడో ఈ సమస్తము ఎవని రూపమో అట్టి సత్యస్వరూపుడగు పరమాత్మను మేము ఉపాసించుచున్నాము.

6-వ సిద్ధు డిట్లనెను :

ఎవరు తమయొక్క హృదయకుహరంబుననున యాత్మను విడిచి యితర దేవతను సేవించుచున్నారో, వారు తమ చేతియందున్న కౌస్తుభమణిని విడిచిపెట్టి యిమగు రత్నమును గోరుచున్నవా రగుదురు.

7-వ సిద్ధు డిట్లనెను :

ఎవడు ఈలోక, పరలోక సంబంధములగు కోరికలను (భోగములను) విడిచి ఈ పరమాత్మోపాసనారూపం బగు ఫలమును పొందుచున్నాడో, వాడు ఆశలను, విషలతలకు మూలంబగు అజ్ఞానమును నరికివేయుచున్నాడు.

8-వ సిద్ధు డిట్లనెను :

అల్పబుద్ధిగల యే మానవుడు ధనాదిపదార్థములకు ఆద్యంతములయందు నిస్సారత్వమును (అనగా ధనము, దేహము మొదలైన రూపములు మొదట లేవు. మధ్యలో పుట్టి కొంతకాలముండి నశించునవే యను విషయమును)



ఎరిగియు వానియందు మరల ఆసక్తిని (మోహమును) ఉంచుచున్నాడో వాడు మనుజుడు గాడు. గాడిదయే యగును.

9-వ సిద్ధు డిట్లనెను :

కామక్రోధాదులతో మానసాదీంద్రియములను శత్రువులు ఏ యే సమయములందు చలించుచుందురో, ఆయా సమయములందెల్ల ఇంద్రుడు వజ్రాయుధముచే పర్వతములను గొట్టినట్లు వివేకమను కత్తిచే గొట్టుచుండవలెను.

10-వ సిద్ధు డిట్లనెను :

మోక్షసుఖము నొందదలచినవారు మొదట కామక్రోధాది దోషములులేని మనోనిశ్చలతను (శాంతిని) పొందుటకు ప్రయత్నించవలెను. ఈ ప్రయత్నమువలన, ఇంద్రియవిషయభోగములపైకి మనస్సుపోక నిశ్చలత కొందును. మనస్సు నిశ్చలమైన మానవునకు తన నిజరూపమైన పరమాత్మసుఖమునందు నిలుకడ గలుగున్నది. ఇదే మోక్ష (కైవల్య) సుఖ మనబడును.

శ్రీ వసిష్ఠ మహర్షి చెప్పుచున్నాడు :

1. శ్రీరామచంద్రా! జనకమహారాజు ఇట్లు సిద్ధులచే పలుకబడిన ఆ వాక్యములను విని, పిరికివాడు యుద్ధ ధ్వనిని విని భయపడునట్లు శీఘ్రముగా దుఃఖములో మునిగినవాడాయెను.

2. అట్లు విచారపడి తన పురమునకు వెళ్లి సమస్తమగు పరివారజనంబును వారివారి గృహంబులకు బంపి, సింహము పర్వతము నెక్కినట్లు ఒక్కడే తన మేడను ప్రవేశించినవా డాయెను.

3. అందుండి యారాజు, ఎగిరిపోవునపుడు చలించుచున్న పక్షియొక్క రెక్కలవలె చంచలమగు లోకముయొక్క స్థితిగతులను జూచుచు, వ్యసనాక్రాంతుడై ఇట్లు విలపించెను.

4. మిక్కిలి కష్టములకు కారణములైనట్టియు, చంచలములైనట్టియు లోకవ్యవహారములయందు, రాళ్లయందు రాళ్లు పొరలునట్లు భ్రాంతివలన నేను పొరలుచుంటిని.

5. ఈ యనంతమైన కాలములో నా జీవితకాలము మిక్కిలి స్వల్పమైనది. ఇట్టి అల్పకాలిక జీవితమునందు ఆశగలిగియున్న యధముడ నగు నన్ను ధిక్కరింపవలయును.

6. నా జీవితముతోపాటు ఈ రాజ్యమును అల్పమైనదే. దీనితోడనే సంతుష్టిజెంది, బుద్ధిచెడిన మానవునివలె రాబోవు దుఃఖవినాశనమునకై చింతింపక యేలయుంటిని ?

7. అనాది, అనంతస్వరూపులమగు మన కీ యల్ప జీవితము శరీర సంబంధముచే మధ్యగలిగినది. కాన, పటములోని చంద్రుని నిజమైన చంద్రునిగా భావింపదలంచిన బాలురవలె, అనిత్యరూపములైన దేహ ధనాది రూపములను నిత్యమైనవని దలంచుచు, నే నేల వ్యర్థముగా ధైర్యమొందుచుంటిని !

8. హా ! కష్టము. ఏ ఇంద్రజాలికుని యింద్రజాలముచే, నేను పరిమోహితుడనై యుంటిని ?

9. ఎయ్యది నిత్యమైన వస్తువో, అట్టిది ఈ జగమున కొంచెమైనను లేదు. ఇటు లుండగా, నా కీ జగమునందు ప్రేమ యొందుచే గలిగినది !



10. ఏ యజ్ఞానులు ఎచట పరమాత్మగల డని చూచుచున్నారో ఆ యజ్ఞానులు వెదకెడి పరమాత్మ, దేవుడు నాయందే గలడు. ఇవ్విధమున నిశ్చయించి నేను సమస్త ప్రపంచ భావములను వదలివేయుచున్నాను.

11. భోగముల కొఱకు, ధనమును సంపాదించెడి మానవులయొక్క ప్రయత్నము లన్నియు నీటిపై గలిగెడి బుడగలవంటివే యగును. భోగముల కొఱకు సంపాదించెడి ఈ ధనాది వస్తువు లన్నియు కేవలము దుఃఖములనే కలుగ జేయుచున్నవి. కాన నిట్టి విషయసుఖములను నే నపేక్షింప నేల ?

12. ప్రతి సంవత్సరమును, ప్రతి మాసమును, ప్రతి దినమును, ప్రతి క్షణమును ఈ సుఖములన్నియు కేవలము దుఃఖరూపములే యగును.

13. ఈ ప్రపంచమునగల ప్రతి వస్తువు శీఘ్రముగా నశించుచున్నది. కాన నా రాజ్యాదులును తుచ్ఛములే యగును. ఏలయన : ప్రసిద్ధములగు ఇంద్రబ్రహ్మాదుల సుఖములును సత్యమైన దృష్టికి నశించిపోవునట్టివిగనే గన్పడుచున్నవి. కాన వివేకుల చిత్తము ఎల్లప్పుడును విశ్రాంతి బొందునట్టి వస్తువు ఏదియు నీ ప్రపంచమున లేదు. పరమాత్మనిష్ఠ యొక్కటే విశ్రాంతిపద మగును.

14. నేడు మహామహుల శిరంబుల నలంకరించినవే కొలదికాలములో నధఃపతనమును బొందుచున్నవి. కాన అనిత్యమగు చిత్తముయొక్క చలనమువలన కనుపించెడి ఈ రాజ్యాది వైభవములందు విశ్వాస మెందుకుండవలెను ?

15. ఆహా! త్రాడులేకయే నేను బంధింపబడితిని. బురదను పూసికొనకయే నేను మలినుడనైతిని. ఎవరిచేతను త్రోయబడకయే పైనుండి క్రిందబడితిని. హా! నా యాత్మజ్ఞానము (ఆత్మస్థితి) నశించినది.

16. బుద్ధిమంతుడనైనప్పటికిని, యెదుట నేనున్నదైసూర్యప్రకాశమును కప్పిపుచ్చిన కాలమేఘమువలె నన్నుఈ మోహమేల యావరించినది?

17. ఈ నా మహాభోగము లేమి? ఈ నా బంధువులెవరు? ఆహా! బాలునివలె వ్యర్థముగా ఇది నాది, అది నాది యను కల్పనలచే, వ్యాకులుడనగుచున్నాను.

18. ముసలితనము, మరణములను గలుగజేయునదియు, భయదాయకమునగు భోగాదులందలి విశ్వాసమును (నమ్మికను) నే నేల స్వయముగ కల్పించుకొనుచున్నాను?

19. ధనము, బంధువులు మొదలైన యీ నా సంపదలు పోవుగాక లేక వృద్ధినొందుగాక. వీనితో నాకేమి పని? ఏలయన, జలమందలి బుడగలవలె ఈ సంపదలన్నియు అసత్యరూపముననే సంప్రాప్తమైనవి.

20. చక్రవర్తుల యీ మహాభోగములు, ఉత్తమగుణ సంపన్నమగువారి యీ బంధుగణము ఇపుడు కేవలము నామమాత్రావశిష్టమైనవి. అట్టిచో నిపుడు గడచుచున్న కాలమందు విశ్వాసమేల?

21. గొప్పగొప్ప రాజుల ధనమంతయు నేమైనది? పూర్వము బ్రహ్మదేవునిచే రచింపబడిన ఆ యనేక బ్రహ్మాండములు ఇపు డెటకేగినవి? ఇక నీ ధనాదులందు నాకేల యపేక్ష?



22. జలము, బుడగలను తనయందు లయమొనర్చుకొనునట్లు లక్షలకొలది ఇంద్రులను కాలుడు మ్రింగివైచెను. అట్లుండ ఈ నా స్వల్పజీవితమునందు అపేక్షగలిగియున్నచో జ్ఞానులు పరిహాసము చేయరా? (ఆక్షేపించరా యనుట)

23. అనంతకోటి బ్రహ్మదేవులు గతించిరి. అనేకసృష్టి పరంపరలు గడచినవి. ధూళి (దుమ్ము) కణములవలె నెందరో రాజులు నశించిరి. ఇక యీ నా జీవితమందాశయేల?

24. సంసారమను రాత్రియందు, చెడ్డ స్వప్నమును దేహధనాది భ్రమరూపమగు ఈ ప్రపంచమున నేను అపేక్ష (కోరిక) గలిగియున్నచో, అట్టి నా యవివేకము ధిక్కరింపబడవలయును.

25. పుత్రధనాదు లనుకొనుట, దేహమే నేను అనుకొనుట మొదలైన కల్పన అన్నియును వ్యర్థములే యగును. అసత్యరూపములును అగును. నేను అహంకారమను పిశాచముతోగూడి మూఢునివలె నేల యుంటిని?

26. క్షణ నిమిష ముహూర్తాది రూపమగు సూక్ష్మకాలముచే ఆయువు క్షణక్షణమునకు నశించిపోవుట చూచుచుండియు నే నేల విచారించుట లేదు?

27. దేనిచేత బ్రహ్మాదులును, బ్రహ్మాండమను పీఠముపై బొమ్మలవలె నిలబెట్టబడిరో, విష్ణువు మొదలైనవారు దేనిచేత ఆటబంతివలె నాకసమున ప్రవర్తింపజేయబడిరో, ఎయ్యది మహారుద్రులనుగూడ మ్రింగివేసెనో, అట్టికల్పరూపమైన కాలమందు ఓ జీవితాశా! నీ వేల నాయెదుట ఆటలాడుచుంటివి?

28. దినములు నిరంతరమును వచ్చుచున్నవి, పోవుచున్నవి. కాని దోషములేని, ఆనందస్వరూపమైన సత్యమైన పరమాత్మ స్వరూపమును జూచిన దినము ఒక్కటైనను నేటివరకును లభించలేదుగదా !

29. చెరువుమీద పక్షులు తిరుగుచున్నటుల, మానవుల మనస్సునందు భోగములపై ఆశలే పుట్టుచున్నవి. కాని పరమాత్మ స్వరూపము కనుపించుటలేదు.

30. అల్ప కష్టమునుండి యధిక కష్టమును, అల్ప దుఃఖమునుండి యధికదుఃఖమును గలుగుచున్నను ఇంత వరకును ఈ సంసారము నెడ విరక్తుడను గాకయుంటిని. హా! అధమచిత్తముగల నేను ధిక్కరింపబడవలయును.

31. సౌందర్య సుఖస్వరూపములైన ఏ యే పదార్థములయందు నేను దృఢమగు ప్రీతి గలిగియుంటినో యవన్నియును నశించినవి. ఇకను ఈ ప్రపంచమున స్థిరముగానుండు వస్తువేదియో చెప్పుము.

32. మధ్యకాలమున రమణీయమగు వయస్సును, అంతమున రమణీయమగు యాగాదులును, అవిచారముచే రమణీయమగు విషయ భోగములును వినాశమను మాలిన్యముచే దూషితములుగాన అపవిత్రములే యగును.

33. ఏ యే పదార్థములయందు మనుజుడు తన విశ్వాసమును ( ప్రేమను ) బంధించుకొనుచున్నాడో, ఆ యా పదార్థముల యందు తరచు దుఃఖమే వానికి గల్గుచుండుట గాంచుచున్నారము.

34. జడస్వభావులగు ఈ జీవులు, బాల్యకాలమున అజ్ఞానముచేతను, యౌవనకాలమున కామభోగముల



చేతను, ముసలితనమున కుటుంబచింతలచేతను పీడింపబడుచున్నారు. ఇక ఎపుడు తమ జన్మలను ఉద్ధరించుకొనుటకు యత్నించెదరు ?

35. మొదట లేనిదై, మధ్యకాలములో కనబడి, చివరకు నశించునదియు, భోగకాలమందు రసహీనమగునదియు, దారిద్ర్యరోగవార్ధక్యాదులచే దూషితమును, సారములేనిదైనను, సారముగలదిగా భ్రమవలన కనబడునదియు నగు ఈ సంసారమును, బుద్ధిలేని మానవులవలె నెందుకుచూచుచున్నాను ?

36. రాజసూయాశ్వమేధాది అనేక యజ్ఞములచే కూడ బ్రహ్మాదులకు మహాకాలమందలి క్షణమాత్రరూపమేయగు స్వర్గమే ప్రాప్తించుచున్నది గాని అంతకంటె యధికముగ మరేమియు సిద్ధించుటలేదుగదా!

37. ఇక ఆపదయను దుష్టభ్రమరము పీడింపని స్వర్గప్రదేశము భూమిపైగాని, పాతాళమునగాని యెచట గలదు? ( అనగా సమస్తకోరికలును నశించి పరమాత్మస్థితి గలుగనంతవరకును దుఃఖము గలుగుచునే యుండునని యర్థము )

38. తన చిత్తమను గుహాలోని సర్పములును, శరీరమను భూమిపైని ఆకులు నగు శరీర సంబంధమైనవియు, మానసిక సంబంధమైనవియు నగు దుఃఖము లెట్లు నివారింపగలుదును ?

39. గడచుచున్న కాలమునకు నాశనము గలదు. రమణీయముగా కనబడువాటియందు రమణీయత నశించుచున్నది. సుఖములయందు దుఃఖములు కాపురము చేయు

చున్నవి. అట్టిచో దుఃఖరహితమగు దేనిని నే నాశ్రయించవలెను ?

40. పామరత్వముతోఁగూడిన నీచమానవు లనేకులు పుట్టుచున్నారు, మరణించుచున్నారు. ఇట్టివారితోనే ఈజగము నిండియున్నది. ఉత్తములగు మహాత్ములిచట చాలా అరుదుగా కనబడుచున్నారు.

41. ఎవరు కన్ను తెరచుటచే జగంబులు పుట్టుచు, కన్నుమూయుటచే నశించునో, యట్టి మహామహులుగూడ నశించిపోవుచుండగా ఇక నేనా స్థిరముగా నుండునది ?

42. మిక్కిలి రమణీయములును, స్థిరమైనవియు నగు పదార్థములు గలవుగాని, వాటి యన్నింటియొక్క పర్యవసానము సంపాదనలో, రక్షణలో, నశించుటలో చింతాదాయకమే యగును. ఇట్లు జరుగుచుండగా ఓ చిత్తమా! నీ వేల వాటిని కోరుచుంటివి ?

43. విచిత్రములైన అనేక సంపదలను ఎక్కువగా మనస్సు కోరుచుండినను, ఆ సంపదలన్నియు నశించు స్వభావము గలవగుటచే ఆ సంపదలను ఆపదలుగనే నేను నిశ్చయించుకొనుచున్నాను.

44. దరిద్రము, బంధునాశనము మొదలైన యాపదలు సాధుసంగ తీర్థసందర్శనాదులకు కారణమై, వివేక వైరాగ్యాదులకు సాధనభూతము లగుటచే వాటిని సంపదలు గనే నేను భావించుచున్నాను.

45. సముద్రమందు ప్రతిబింబించిన చంద్రునివలె క్షణభంగురమును, మనస్సుయొక్క కల్పనారూపమగు ఈ





జగత్తునందు నేను, నాది మొదలైన వాక్యములు ఎచటి నుండి వచ్చినవి ?

46. కాకతాళీయయోగమున గలిగిన ఈ జగత్తు నందు మనస్సు, 'ఇది వద్దు, ఇది కావలెను' అను కల్పనలను వ్యర్థముగా చేయుచున్నది.

47. దేశకాల వస్తువులచే పరిచ్ఛిన్నమై, త్రివిధ తాపములచే (అనగా ఆధ్యాత్మిక, ఆదిభూత, ఆదిదైవిక తాపములచే) సంతప్తమైన అగ్నిశిఖవంటి ఈ సాంసారికదశలందు పక్షివలె నే నేల యాసక్తుడనై యుంటిని ?

48. అగ్నియందు పడి భస్మమగుట మేలు. రౌరవ నరకమున బడి దొర్లుట మేలు. కాని, సుఖ దుఃఖరూపమగు ఈ సంసారదశయం దుండుట యుత్తమము గాదు.

49. సంసారమే సమస్త దుఃఖములకును స్థానము. దానియందు పడిన మానవున కిక సుఖ మెట్లు గలుగును ?

50. అధికముగా దుఃఖము లనుభవించువారు అల్ప దుఃఖములను సుఖరూపములుగా తలంచునట్లు, దుఃఖరూపములుగా పరిణామమునొందు విషయభోగములను సుఖవంతమైనవాటినిగా మానవులు దలంచుచున్నారు.

51. ఆహా! అధములును, శిలాప్రతిమలవలె కదలని స్థితిగలవారు నగు అజ్ఞానులవలె నేనును విచారహీనుడనై తినిగదా !

52. పలువిధ సంకల్పములే యంకురముగను, బ్రహ్మాండములే శాఖలుగను, విరాట్పురుషుడే శాఖాద్యవయవములుగను, సుఖదుఃఖములే ఫలములుగను, రాగలోభా

వలె చిగురుటాకులుగను గల్గి శోభాయమానమై యున్న ఈ విశాల సంసారవృక్షమునకు మూలము మనస్సే యగును.

53. సంకల్పమే మనస్సని నే నెంచెద. కాన సంకల్ప నాశనముచే నేను ఈసంసారమను వృక్షమును ఎండింపజేసెద. ఇది ఇక యెట్లు మరల అంకురించునో చూచెద.

54. ఆకారమాత్రముచే రమణీయములును, మనస్సను కోతితోఁగూడి చపలత్వముగలవియు, నాశముగలవియు నగు ఈ సాంసారిక వృత్తులందు నేను ఇక ఆసక్తినుంచను.

55. పలువిధ ఆశలను త్రాళ్ళతో కూడినదియును, తక్కువ యెక్కువలతో వికారముల జెందునదియును, దుఃఖముల గలిగించునవియు నగు ఈ సాంసారికవృత్తులను నేను ఇంతవరకును ఎక్కువగా ననుభవించితిని. ఇక నిపుడు వైరాగ్యముతో (నిరాశతో) విశ్రాంతి నొందెదను.

56. 'హా! చంపబడితిని. నశించితిని' అని ఇట్లు పరితాపము జెందు కాలము ఇపుడు గతించినది. ఇక నీ సాంసారిక వస్తువులకై నేను దుఃఖంచను.

57. ఇదివరకు నేను అజ్ఞాన మను నిద్రలోనుంటిని. ఇపుడో మేల్కాంటిని. ప్రసన్నుడనైతిని. పారమార్థిక ధనమగు ఆత్మజ్ఞానమును దొంగిలించినట్టి దొంగను కనుగొంటిని. ఆ దొంగ యెవరనగా మనస్సే. అతడు దొంగే కాదు, శత్రువుకూడ నగును. ఎందువలన ననగా : నేను ఇతనివలన చాలకాలమునుండి అనేకవిధములుగా పీడింపబడితిని. ఇక నేనే వీనిని పీడించి చంపెద.

58. ఇంతవరకు ఈ నా మనస్సను ముత్యము బాగుగా కనబడక, స్వాధీనముగాక యున్నది. కాని యిపుడు



స్వాధీనములో నుండి మంచిగుణము గలదై సుఖపెట్టుచున్నది.

59. ఇక నా మనస్సను మంచుబిందువు వివేకమను సూర్యతాప ప్రభావమున, అనాదిబ్రహ్మతత్వమున స్థిరముగా నిలబడి శాంతి నొందగలదు.

60. సాధువులచేతను, మహాత్ములగు సిద్ధపురుషుల చేతను పలువిధముల నుపదేశముల నొందిన నే నిక నిరతిశయానందమునకు సాధనభూతమగు పరబ్రహ్మమును శరణు జొచ్చుచున్నాను.

61. ఆత్మయను మణిని బొంది దానినే ధ్యానించుచు ఇతరమగు పనులను వదలిపెట్టి హిమాలయాది పర్వతములపై మేఘములు నివసించునట్లు నేను ఏకాంత ప్రదేశమున సుఖముగ నుండెద.

62. ఈ దేహమే నేను. ఈ రాజ్యాదులు నావి యను నీ మొదలగు అసత్యభావములను బలాత్కారముగా పారద్రోలి, మిగుల బలముగల మనస్సను శత్రువును చంపి, వివేకద్వారమున సప్తమభూమికా రూపమైన పరమశాంతి యందు నిశ్చలముగ నుండెద. కాన, యట్టి ఓ వివేకమా! నీకు నమస్కారము.

## జనకుని నిశ్చయము

63. ఈ రాజ్యమేమి? ఈ సుఖమేమి? క్షణభంగురమైన ఈ రాజ్యసుఖములతో నాకు ఇపుడు కొంచెమైనను ప్రయోజనము లేదు. ఎండమావుల జలమువలె అసత్యమగు ఈ సంసారమంతయును వదలినవాడనై, శాంత సముద్రమువలె నేను ఏకాంతమున నివసించెద.

64. అనిత్యస్వరూపములైన ఈ భోగములవలన నా కేమి ప్రయోజనము? కాబట్టి అన్ని పనులను వదలి కేవలము బ్రహ్మ (సుఖ) రూపమున నుండెద.

65. ఓ చిత్తమా! పుట్టుక, చావు, ముసలితనము, జడత్వముల రూపమగు బురద నశించుకొంటకు, విషయ భోగములలోని అల్పసుఖమును గ్రహించెడి నీ స్వభావమును వదలుము.

66. ఓ చిత్తమా! భ్రాంతిచేత నీ వీ ప్రాపంచక స్థితులందు సుఖమును చూచుచున్నావుగాని వాటిచే నీకు అపార దుఃఖమే సంప్రాప్తమగును.

67. చాలకాలమునుండి భోగములయందు సంచరించుచు, అవి నశించునపుడు భయముజెందుచు, భోగములలో దుఃఖములు గలవని పెద్దలవలన, శాస్త్రములవలన వినుచును నీవు తృప్తి బడకయున్నా వేమి?

68. ఓ దుష్టచిత్తమా! తుచ్ఛమగు ఈ భోగాశచే నీకు కొంచెమైనను ప్రయోజనము లేదు. అందువలన నిజమైన తృప్తి, ఆనందము దేనివలన లభించునో అట్టి పరమాత్మ వైపునకు ఇక మరలుము.

69. గ్రహింపదగిన వస్తువేది? దేనిని నేను ప్రయత్నముచే సాధింపవలెను? నాశరహితమగు నే పదార్థమందు నేను నా విశ్వాసమును బంధించుకొందును? పనులు చేయుటచేగాని, చేయకుండుటచేగాని నా కేమి ప్రయోజనము?

70. ఏలయన, పుట్టిన వస్తువు లన్నియును వినాశమొందుచునేయున్నవి. అసత్యరూపమున పుట్టిన ఈ శరీరము



పనులు చేయుచున్నను, పనులను చేయకున్నను రెండవస్థలయందును సమానరూపముగానుండు శుద్ధచైతన్య(పరమాత్మ) రూపుడనగు నాకు హానియేమి?

71. ప్రాప్తించని దానిని నేను కోరుటలేదు. ప్రాప్తించిన దానిని వదలుటలేదు. సుఖస్వరూపమున ఆత్మయందు నెలకొనియున్నాను. లోపల, వెలుపలను నిండి నిరతిశయానంద స్వరూపాత్మ యేది గలదో, అదే నేనుగాని యితరము గాదు.

72. పనులు చేయుటచేగాని, చేయకుండుటచే గాని నాకిక యేమియు ప్రయోజనము లేదు. పనులను చేయుటచేగాని, చేయకుండుటచేగాని గలిగిన ఫలితము అసత్యమును, దుఃఖరూపము నగును.

73. శాస్త్రములో చెప్పిన పుణ్యకర్మలును, లౌకిక కర్మలును నగు పనులను చేయుటచేగాని, చేయకుండుటచే గాని గలుగు ఫలితమునందు నాకు కోరికయే లేదు. కనుక క్రమానుసారము ప్రాప్తించిన పనులను ఈ నా శరీరము చేయుగాక. ఏలయన, ఏపనియు లేకుండ ఈశరీరము శుష్కించిపోయిన నేమి ప్రయోజనము?

74. ఆసక్తిరహితమై నా హృదయము సమాన దృష్టితో నుండునపుడు దేహమునుండి గలిగిన క్రియాక్రియ రూప ప్రారబ్ధముయొక్క పుణ్యపాపములవలనగలిగిన ఫలమును సమానమే యగును.

75. కర్మయందలి కర్తృత్వ (నేను చేయుచున్నాను) భోక్తృత్వ (నేననుభవించుచున్నాను) అను భావములు రెండును, మనస్సుచేయు కల్పనలే గాన అయ్యవి నశించినచో

నిక మానవునిచే చేయబడు కార్యములన్నియును నిజముగా చేయునవే యగును.

76. కర్తృత్వ భోక్తృత్వ విషయమై మనుజుని బుద్ధియందు ఎట్టి నిశ్చయము రూఢిపడియుండునో, దేహాది సమస్త క్రియలయందును అత డద్దాని రూపమునే జెందుచుండును.

77. ఇపుడు నాబుద్ధి కర్తృత్వ భోక్తృత్వ మనువ్యాధి లేనిదై ఆత్మపదమున దృఢనిశ్చయమును పొందియున్నది. కాన ఇష్టమైనది ప్రాప్తించక, అనిష్టమైనది ప్రాప్తించునేమో యను అధైర్యమును నే నిక వదలుచున్నాను.

## జనకుడు చిత్తమును శాసించుట

78. ఓ చిత్తమా! ఈ చంచల సంసారము నీకు సుఖమును గలిగింపజాలదు. కాబట్టి నీవు శాంత మొందుము. శాంతిచే చిత్త వికారములు లేని ఉత్తమ ఆత్మసుఖము నీకు లభించును.

79. నీవు ఏ విధముగ సంకల్పముల గావించెదవో, ఆ యా రూపముననే ఈ సంసారము విశాలత్వము జెందుచుండును. వృక్షమును జలముచే పోషించిన అనేక శాఖలుగా పరిణామము జెందునట్లు, ఓ దుష్టచిత్తమా! నీవును భోగములపై ఇచ్ఛవలన శరీర సంబంధమైనవియు, మనస్సంబంధమైనవియు నగు దుఃఖముల నొందుచున్నావు.

80. విషయభోగములను చింతించుటవలననే చావు, పుట్టుకల రూపమైన ఈ సంసారము గలుగుచున్నది. కాన నీవు దానిని విడచి శాంతినొందుము.



81. ఓ చిత్తమా! చపలమగు ఈ సంసారమును ఒక సిబ్బెయందును, శాంతి సుఖమును రెండవ సిబ్బెయందును పెట్టి త్రాసుతో తూయుము. (అనగా బుద్ధిచే నేది శ్రేష్ఠమో పరీక్షింపుము) సారవంతముగ తోచినచో నీవు సంసారమునే యాశ్రయింపుము. శాంతిసుఖమే సారమని తోచిన శాంతినే సంపాదించుకొనుము.

82. ఈ సంసారము అపారమైనదిగాన దీనియందుగల ఆశను వదలిపెట్టుము. మరియు కనబడుచున్న నామరూప ప్రపంచ విషయములయందు ఆసక్తిచే గ్రహింపకయు, ద్వేషముచే వదలిపెట్టకయు నుండి ఆత్మసుఖము (మోక్షసుఖము) నొందవలె నను పట్టుదలతోనుండి ప్రపంచవిషయములకు అంటక, సాక్షిగనుండి నీ యిచ్ఛవచ్చినట్లు పనులను చేయుము.

83. సాధువగు నో చిత్తమా! ఈ కనబడు నామరూప ప్రపంచము సత్యమైనదైనను, అనిత్యమైనదైనను ఈ ప్రపంచములోగల మంచిచెడ్డలవలన సంతోషముగాని, క్లేశమునుగాని పొందక నిశ్చలముగ, నిర్వికారముగ నుండుము.

84. ఓ మనసా! ఈ కనబడు ప్రపంచముతో నీ కేమియును సంబంధము లేదు. లేని (అనిత్య) వస్తువుతోడి సంబంధము నీ కెట్లు పొసగును?

85. మనసా! నీ రూపము అనిత్యమే యగును. ప్రపంచమును నిత్యమైనది గాదు. వంధ్యాపుత్ర ఆకాశపుష్పములవలె అసత్యరూపములగు పదార్థములకు సంబంధము గలదనుట ఆశ్చర్యకరముగ నున్నది.

86. ఈ ప్రపంచము అసత్యమైనదనియు, నీవు ఆత్మ రూపముచే సత్యమైనదానవనియును చెప్పినచో, అట్లైనను చనిపోయిన జీవులకు బ్రదికియున్న జీవులకును సంబంధ మెట్లు గలుగును? పోనిమ్ము, మనసా! నీవును ఈ ప్రపంచమును సత్యమే యైనచో రెండును ఏకరూపమున ఎల్లప్పుడును ఉండి నట్లైన లాభనష్టములచే సుఖదుఃఖముల నొందవలసిన పనియే లేదుగదా? కనుక (మానసిక) వ్యాధిరూపమున కలుషిత మును చంచలరూపమును అగు ఈ సంసారమును వదలి నిశ్చలత (సమాధి) నొందుటకు ప్రయత్నించి ప్రశాంతరూప మగు ఆత్మయందు నిలుకడ నొందుటకు ఉత్సాహము గలిగి యుండుము.

87. ఓ సుమతీ! బంతివలె గుండ్రనైనట్టి కోఅవి వలె స్వయముగ మండుచు, వ్యామోహములతో మందబుద్ధి గలదాని వెన్నటికిని గాకుము.

88. పరిపూర్ణ సుఖము (మోక్షసుఖము) నొందు టకు అనువగు నే పదార్థమును ఈ కనబడు ప్రపంచములో లేదు. కనుక ఓ దుష్టమానసమా! అభ్యాస వైరాగ్య బలముచే ధీరత్వమును అవలంబించి చంచలత్వమును వీడుము.

## 23. గృహస్థ సన్న్యాసాశ్రమముల శ్రేష్ఠత్వము

శ్లో. వనేపి దోషాః ప్రభవంతి రాగిణాం
గృహేపి పంచేంద్రియ నిగ్రహస్తపః
అకుత్సితే కర్మణియః ప్రవర్తతే
నివృత్తరాగస్య గృహం తపోవనమ్.



తా. కోరికలుగల సన్న్యాసులు వనములయందున్నను, పాపదోషములనే అజ్ఞానమునే పొందుదురు. మానసాదింద్రి యములను నిగ్రహించినవారు గృహములందే యున్నను గొప్ప తపస్సంపన్నులనియే చెప్పబడుదురు. పాపపు కర్మము లను చేయనివారియొక్కయు కోరికలు లేనివారియొక్కయు గృహము తపోవనముతో సమానమే యగును.

శ్లో. సర్వేషామపిచైతేషాం। వేదస్మృతివిధానతః
గృహస్థ ఉచ్యతే శ్రేష్ఠః। సత్రీనేతాన్ బిభర్తిహి.

తా. బ్రహ్మచారులను, వానప్రస్థులను, సన్న్యాసులను, గృహస్థులే పోషించుటవలన, అన్ని ఆశ్రమములకన్నను, గృహస్థాశ్రమమే శ్రేష్ఠమైనదనియు శాస్త్రములచే చెప్ప బడుచున్నది.

శ్లో. యథామాతరమాశ్రిత్య। సర్వేజీవంతి జంతవః
వర్తంతే గృహిణంతద్వ। దాశ్రిత్యేతర ఆశ్రమాః

తా. తల్లిని ఆశ్రయించియుండి సమస్త జీవులును పోషింపబడుచున్నట్లు, గృహస్థులను ఆశ్రయించియే యితర ఆశ్రమస్థులును పోషింపబడుచున్నారు కాన గృహస్థులేగొప్ప.

శ్లో. మేరుసర్షపయోర్యద్వత్। సూర్యఖద్యోతయోరివ
సరిత్ సాగరయోర్యద్వత్। తథాభిక్షుగృహస్థయోః.

తా. మేరుపర్వతమునకును ఆవగింజకును ఎంత భేదము గలదో, సూర్యుని కాంతికిని, మిణుగురు పురుగు యొక్క కాంతికిని ఎంతభేదముగలదో, సముద్రమునకును నదికిని ఎంతభేదము గలదో, అంత భేదము సన్న్యాసికిని గృహస్థునకును గలదు. అనగా గొప్పవైన మేరుపర్వతము.

సూర్యుడు సముద్రమువంటివారు సన్యాసులు, చిన్నదియైన ఆవగింజ, మిణుగురుపురుగు, నది (కాలువ) వంటి చిన్న వారు (తక్కువవారు) గృహస్థు లనబడుదురు.

శ్లో. గృహస్థానాం సహస్రేణ। వానప్రస్థ శతేనచ
బ్రహ్మచారీ సహస్రేణ యోగాభ్యాసీ విశిష్యతే.

తా. వేయిమంది గృహస్థులకంటెను, నూరు (వంద) మంది వానప్రస్థులకన్నను, వేయిమంది బ్రహ్మచారుల కంటెను బ్రహ్మనిష్ఠుడైన సన్న్యాసియే గొప్పవాడనబడును.

శ్లో. అహంకారసుతం విత్త। భ్రాతరం మోహమందిరమ్
ఆశాపత్నీం త్యజేద్యావత్ । తావన్ముక్తో నసంశయః.

తా. (1) అహంకార మను పుత్రుని (2) ధనమను సోదరుని (3) మోహమను గృహమును (4) ఆశయను భార్యను (భర్తను) ఎవరు విడిచెదరో వారే ముక్తులనబడుచున్నారు. ఇందుకు సందేహము లేదు.

## 24. చతుర్విధ ముముక్షువులు

(సర్వవేదాంత సిద్ధాంత సంగ్రహమునుండి)

(1) గృహమువలన, ధనమువలన, పుత్ర మిత్ర బంధువులవలన ప్రతిదినమును అనేకవిధములుగా బాధలు పడుచు ఈ సంసారము దుఃఖస్వరూపమైనది అపారమైనది యని తెలిసికొని ఏ మానవుడు వదలిపెట్టుచున్నాడో, ఆ మానవుడే తీవ్రతర ముముక్షు వనబడును. ఇతడు ఈ జన్మములోనే దుఃఖరహితమైన కైవల్యము నొందును.



2. ఏ మానవులు నిత్యానిత్య వస్తువిచారణ ద్వారమున భగవంతుడే నిత్యుడు. ఈ శరీరాది సంసారమంతయును అసారమైనది. దుఃఖ హేతువైనది యని తెలిసికొనియును, ఇటు సంసారమును వదలలేక అటు భగవంతుని పూర్తిగా నమ్మజాలక మధ్యలో (కాలురమధ్యగల బంతివలె) కొట్టుకొందురో వారే మధ్యతరగతికి జెందిన ముముక్షువు లనబడుదురు. వీరు ముందుజన్మకు ముక్తులగుదురు.

3. ఏ మానవులు మోక్షమునొందుటకు, భగవంతుని భజించుటకు, ఇప్పటినుండి తొందరయేల పడవలెను? చేయవలసిన కార్యముల నన్నింటినిచేసి, అనుభవించవలసిన భోగముల నన్నిటిని అనుభవించి, తరువాత మోక్షమునకై భగవంతుని తెలిసికొనుటకై ప్రయత్నము చేయవచ్చునని తలంతురో ఆ మానవులు మందముముక్షువు లనబడుదురు. వీరికి ఈ యుగములో ముక్తికలుగదు.

4. మార్గమున (దారిని) నడచుచుండగా మణి దొరికినట్లు మాకు అప్రయత్నముగా మోక్షము (జ్ఞానము) దొరికి ధన్యులమయ్యెద మని ఏ మానవులు తలచి ప్రయత్నమును చేయక యుందురో ఆ మానవులు అతిమంద ముముక్షువు లనబడుదురు. వీరికి కోటికల్పములకైనను మోక్షము గలుగదు.

## 25. షడ్విధానందములు

1. పాపానందము: హింస, అసత్యము, దొంగతనము, మోసము, వ్యభిచారము మొదలైన పాపపు పనులతో ఆనందించుట.

2. భోగానందము : ధనధాన్యములతో, వస్తువాహనములతో, బంధుమిత్ర పుత్రసేవకాదులతో ఆనందించుట.

3. పుణ్యానందము : పూజ, దానము, భగవన్నామ సంకీర్తన, జపధ్యానాదులతో ఆనందించుట.

4. భక్త్యానందము : అహింస, ఉపవాసము, వైరాగ్యము, శాంతము, మోక్షాపేక్షలతో ఆనందించుట.

5. జ్ఞానానందము : నేను పరబ్రహ్మను సర్వసాక్షిని, నిర్వికల్పుడను, సత్యజ్ఞానానందస్వరూపుడనని ఆనందించుట.

6. సహజానందము: సర్వపరిపూర్ణమైయున్న ఆత్మయే నేను నామరూపాదు లన్నియు నేనే యని స్వరూపనిష్ఠుడై ఆనందించుట.

## 26. వృద్ధ దంపతుల సంభాషణలు

భర్త చెప్పుట : సతీ మన మిపుడు వృద్ధావస్థ నొందితిమిగదా కనుక ఇకనుండి మనము పూర్తిబ్రహ్మచర్య వ్రతము నవలంభించి నిరంతరమును భగవంతునకును మహాత్ములకును ప్రియములైన పూజసేవ భగవన్నామ సంకీర్తన జపధ్యానములను చేయుచు భక్తి జ్ఞాన వైరాగ్యములతో జీవితమును గడుపుచు వారి దివ్యానుగ్రహమును సంపాదించు కొందము.

మన కెంత ధనమున్నను మన కెందరు బిడ్డలున్నను మన కెందరు బంధుజను లున్నను మనము చనిపోవునపుడు మన వెంటవచ్చునవి మనము చేసుకొనిన మంచి చెడు కర్మల ఫలితములే గదా. కనుక మనము లోకచింతలతో సంసార



వ్యామోహములతో అహంకార మమకారములతోను కట్టుబడియుండక మనదారిని మనము పవిత్ర మొనర్చుకొని పోవుటకు సిద్ధముగా నుందము.

శరీరసౌఖ్యములకు సంసారచింతలకు పుత్రమిత్రాదులపై గల మమకారములకును లోపడక మోసపోక చిక్కుకొనక మన బంధములను మన అజ్ఞాన గుణములను మన తాపత్రయములను నశింపజేయునట్టి భక్తవత్సలుని పరమేశ్వరుని పరంధాముని నిరంతరమును భజించుచు పరమ భక్తుల సాధుపుంగవుల మహాజ్ఞానుల యాశీర్వాద భాగ్యమును కూడ సమకూర్చుకొని మన జీవయాత్రను గడుపుదము. నీ యభిప్రాయమేమో చెప్పుము.

భార్య చెప్పుట : నాథా! మీరు చెప్పిన విషయము లన్నియు నాకు చాలా బాగుగా యున్నవి. అశాశ్వతమైన లోకముపై దేహముపై సంసారముపైనిగల వ్యామోహములను చంపుకొని పరమపావన మంగళస్వరూపుడగు పరమాత్మను భజించుచుండుటయే మనయొక్క పరమ కర్తవ్యము.

మనజీవితములో అనేకులు కోటీశ్వరులు, దరిద్రులు, విద్వాంసులు, ప్రభువులు, భక్తులు, సాధువులు, మహానీయు లున్ను శరీరాదులను విడిచి వెళ్లిరను విషయమును స్వయముగా చూచినాము, వినియున్నాముకూడ. కనుక తప్పకుండ ఇకనుండి సంసారబంధమును సంపాదన కృత్యమును, బంధుమిత్రాదుల సంబంధమును వదలివేసి సర్వదా సత్సంగముతో, సద్గ్రంథ పఠనతో, భగవన్నామ సంకీర్తన జపధ్యానములతో, ఆత్మానాత్మ విచారణతోను క్రమ

క్రమముగా దేహము మనస్సులే నేను అను అభిమానమును తొలగించుకొని ఆత్మను పరమాత్మలో ఏకము చేయుటకు ప్రయత్నము చేయుదము. మన ప్రయత్నములకు దేవతలు, ఋషులు, మహాత్ములు, పంచమహాభూతములు ప్రకృతి మాతయు తోడ్పడుదురుగాక. మన గమ్యస్థానమగు పరబ్రహ్మమునందు ఐక్యమొందుదముగాక.

ఆ. తరుణిసుతులు ధనము ధాన్యముల్ సంపద
లెంతచుట్టుకొనిన నంతచేటు
పసిరికాయ పురుగు పద్ధతి కానరో
విశ్వదాభిరామ వినుర వేమ.

ఆ. తనువు విడిచి తాను తరలిపోయెడివేళ
తనదు భార్య సుతులు తగి వార
లొక్కరైన నేగరు సురుమాత్రమె కాని
తనదు మంచితోడు తనకు వేమ.

ఆ. భూమి నాదియనిన భూమి ఫక్కున నవ్వు
దానహీనుజూచి ధనము నవ్వు
కదనభీతుజూచి కాలుడు నవ్వును
విశ్వదాభిరామ వినుర వేమ.

క. మా యిల్లని మా పొలమని
కాయము తన సొమ్మటంచు గామాతురుడై
మాయని పదవిని గోరక
దాయాదుల పాలుసేయ దగదుర వేమ.



# 27. పుణ్యఫలము

శ్లో. యేషాం త్వంతగతం పాపం జనానాం పుణ్యకర్మణామ్
తేద్వంద్వ మోహనిర్ముక్తా భజంతే మాం దృఢవ్రతాః॥

తా. ఏ మానవులు మనోవాక్కాయములచేత అన్నవస్త్రాది దానధర్మములచేతను పాపదోషములను నశింపజేసికొనినారో ఆ పుణ్యకర్మపరులు సుఖదుఃఖ మోహాది ద్వంద్వములనుండి విడుదలనొంది సుస్థిరమైన భక్తిగలవారై భగవంతుని భజించుచున్నారు.

శ్లో. బహుజన్మకృతైః పుణ్యైః వైరాగ్యం ఖలుజాయతే
వైరాగ్యేణ వినా జ్ఞానం కదాచి న్నోపజాయతే॥

తా. అనేక జన్మలనుండి చేయబడిన పుణ్యఫలము గలవారికే ఇంద్రియ విషయ భోగములయందు వైరాగ్యము కలుగును.

శ్లో. జన్మాంతర సహస్రేషు తపోధ్యాన సమాదిభిః
నరాణాం క్షీణ పాపానాం కృష్ణే భక్తిః ప్రజాయతే.

తా. అనేక సంవత్సరములనుండి (బహు జన్మలనుండి) చేయబడిన తపస్సు ధ్యానసమాధులవలన పాప దోషములు నశించి భగవంతునిపై భక్తి కలుగును.

శ్లో. స్వచ్ఛంద భైక్షముపపన్న మఠాధివాసః
సత్సంగతి ర్విషయసంగ నివర్తితా చ
వేదాంతవాక్య మననం శ్రవణం పరాత్మ
ధ్యానం చ భాగ్యవశతో యతయో లభంతే.

తా. పుణ్యఫల భాగ్యము గలవారికి మాత్రమే మోక్ష సాధనానుకూలములైన వేళకు సాత్త్విక భోజనము, నివ

సించుటకు ప్రశాంతమైన స్థలము, సజ్జన సాంగత్యము, విషయములపై వైరాగ్యము, వేదాంతధర్మముల శ్రవణము, విచారణచేయగల భాగ్యము, పరమాత్మధ్యానమునందు దృష్టి నిలచుటయును సిద్ధించును ( లభించును ).

శ్లో. జ్ఞానం సర్వాంతరంభాతి కూటస్థాత్మ స్వరూపకం
ప్రజ్ఞామాత్ర మిదం సూక్ష్మం కోఽపి జానాతి పుణ్యకృత్.

తా. సమస్త ప్రాణికోట్ల హృదయమందు ప్రజ్ఞామాత్రమై, కూటస్థాత్మ స్వరూపమై, సూక్ష్మమునైన జ్ఞానము ప్రకాశించుచున్నది. అయినను పుణ్యకర్మల నెవడు చేసినాడో వాడుమాత్రమే ఆ పరబ్రహ్మజ్ఞానము నొందుచున్నాడు.

"జ్ఞానము త్పద్యతే పుంసాం క్షయాత్పాపస్య కర్మణః".

తా. పుణ్యకార్యములద్వారా పాపదోషములు నశించినపుడే మానవునకు జ్ఞానము గలుగుచుండును.

"సత్కర్మ పరిపాకతో బహూనాంజన్మనా మంతే
నృణాం మోక్షేచ్ఛా జాయతే."

తా. అనేకజన్మలందు చేసిన నిష్కామ పుణ్యకర్మ పరిపక్వమువలననే మానవులకు మోక్షేచ్ఛ గలుగును.

శ్లో. వనే రణే శత్రు జలాగ్నిమధ్యే మహార్ణవే పర్వత
మస్తకేవా।
సుప్తం ప్రమత్తం విషమస్థితంవా రక్షంతి పుణ్యాని
పురాకృతాని.

తా. మనము వనమునందున్నను, యుద్ధమందున్నను, శత్రువులమధ్య నున్నను, జలముయొక్క, అగ్నియొక్క





మధ్యలనున్నను, సముద్రమందున్నను, పర్వతశిఖరమందున్నను, నిద్రించుచున్నను, మేల్కొనియున్నను, మిక్కిలి కష్టస్థితిలోనున్నను యిదివరకు మనము చేసికొనిన పుణ్యమున్నచో తప్పక రక్షించుచుండును.

శ్లో. పుణ్యా దవాప్యతే రాజ్యం పుణ్యా దవాప్యతే జయః
పుణ్యా దవాప్యతే లక్ష్మీః యతో ధర్మ స్తతో జయః.

తా. పుణ్యమువలననే రాజ్యము లభించును. పుణ్యముగలవారికే జయము గలుగును. పుణ్యాత్ములకే లక్ష్మి ( సంపదలు ) ప్రాప్తించును. ఎచట ధర్మముకలదో అచటనే జయముగలుగును.

"కురు పుణ్య మహోరాత్రమ్."

తా. రాత్రింబవళ్లును పుణ్యమును మనస్సుతో, వాక్కుతో, శరీరముతోను చేయుము ( అని శంకరులు ).

శ్లో. పరిపక్వమానసానాం పురుషవరాణాం పురాతనైః
సుకృతైః
బ్రహ్మైవేదం జగదితి భూయః ప్రబోధయత్యేషః.

తా. పూర్వసుకృతమువలన పరిపక్వాన్తఃకరణులగు వివేకులకు, బ్రహ్మమే యీ జగత్తు అని ఉపనిషత్తులు పలుసారులు చెప్పుచున్నవి.

శ్లో. జన్మభిః కోటిపర్యంతైః నిర్వృత్తైః పుణ్యకర్మభిః
శుద్ధాత్మనాం సతామేవ జిజ్ఞాసాఽత్మని జాయతే॥

తా. కోట్లకొలది జన్మలనుండి పుణ్యకర్మలచేయుచు రాగా రాగా ఎవరి హృదయము పరిశుద్ధమైనదో, వారికే ఆత్మజ్ఞానము నొందవలెననెడి దృఢమైన కోరిక కలుగును.

( శంకరాచార్యులు )

కూలి లేనివానికి (ఉద్యోగము దొరకక బాధపడు వారికి) కూలిపని (ఉద్యోగము) దొరుకుట పుణ్యమే. కూలి వాడు కావలసినవానికి కూలివాడు (సేవకుడు) లభించుట పుణ్యఫలమే యగును.

సేవచేయువారికి సేవచేయించుకొనే పెద్దలు లభించడము పుణ్యఫలమే. సేవచేయువారు లభించక శ్రమపడు వారికి సేవజేయువారు లభ్యపడుట పుణ్యఫలమే.

గురువునకు ఉత్తమ శిష్యులు లభించడము పుణ్యఫలమే. భక్తి, శ్రద్ధ, వైరాగ్యములు గల (ఉత్తమ శిష్యలక్షణములు గల) భక్తులకు ఉత్తమ గురువు దొరుకుటయు పుణ్యఫలమే యగును.

బోధించువారికి శ్రద్ధగా విని ఆచరించువారు లభించుట పుణ్యఫలమే. శ్రద్ధగా విని ఆచరించవలెనను తీవ్రేచ్ఛగల వారికి చక్కగా బోధించువారు దొరుకుట పుణ్యమే యగును.

పెట్టువారికి (దానము చేయువారికి) తీసికొనువారు లభించుట పుణ్యమే. తీసికొనువారికి (లేమిచే బాధపడు వారికి) ఇచ్చువారు దొరుకుట పుణ్యఫల విశేషమే యగును.

పాపకర్మ దోషమును క్షీణింపజేయుచు, భక్తిజ్ఞాన వైరాగ్యములను అభివృద్ధిపరచునట్టి కష్టములు నష్టములు, నిందలు రోగములున్ను వచ్చుట కూడా పుణ్యఫలమే యగును.

జ్ఞానముతో కష్టము లనుభవించువారు పుణ్యాత్ము లనబడుదురు. పరమభక్తు లనబడుదురు.

అజ్ఞానంతో కష్టము లనుభవించుచు చలించుచుండు వారు పాపులు, వారు పామరు లనబడుదురు.



## 28. పుణ్యములో పాపము

శ్లో. అగ్నిహోత్రాశ్చ వేదాశ్చ రాక్షసానాం గృహేగృహే
దయా సత్యంచ శౌచంచ నాస్తి తేషాం గృహేగృహే.

తా. రాక్షసుల యొక్క ప్రతిగృహమందును అగ్నిహోత్రము, వేదాధ్యయనము నగు పుణ్యకర్మలు కలవు. కాని ఆ రాక్షసులకు భూతదయ, సత్యవచనము, శుచిత్వమున్ను లేవు (అనగా, ప్రాణిహింస, అబద్ధము లాడుట, శరీరమును, వాక్కును, హృదయమును మలినముతో నుంచుకొనుటయు నగు పాపకర్మలను కలిగియుందు రని తాత్పర్యము). ఇది పుణ్యములో పాపము.

శ్లో. అభివాదన శీలస్య, నిత్యం వృద్ధోపసేవినః
చత్వారో ధర్మవర్ధంతే, ఆయుర్విద్యా బలో యశః.

తా. ప్రతిదినము వృద్ధులకు నమస్కరించుచు, సేవచేయుచున్నచో ఆయువు, జ్ఞానము, బుద్ధిబలము, కీర్తియును వృద్ధియగుచుండును (మనువు).

భక్తిమార్గములో, వేదాంతమార్గములో నున్నవారలలో ననేకులు తల్లిదండ్రులకు, అత్తమామలకు మరియు తమ్ము ఆశ్రయించియున్న వృద్ధులకు, రోగులకును సరిగా సేవచేయక, వారిక్షేమము కొరకు సరిగా ధనము ఖర్చుపెట్టక, బాధలు పడుచున్న వారి మొరాలకించక పూజలతో, ప్రార్థన పారాయణలతో, జప ధ్యానములతోను కాలముగడుపుచు, కీర్తిప్రతిష్ఠలకు ధనమును ఖర్చుపెట్టుచు నుందురు. ఈవిధముగా,

దైవసేవ చేయుచు, తమ్ము ఆశ్రయించియున్న వారికి, తల్లిదండ్రాదులకును సేవచేయక కష్టములపాలు చేయుట పుణ్యములో పాపమే యగును.

ఒక భక్తుడు సప్తాహము చేయదలంచి ధనవంతుల నడిగి వేలకొలది ధనమును, బియ్యమును, కందిపప్పు మొదలగు పప్పు పదార్థములను, కూరగాయలను ప్రోగుచేసి సప్తాహ కార్యక్రమమును ప్రారంభించి జరుపుచు లోభ గుణముతో సరిగా ధనాదివస్తువులను ఖర్చుపెట్టక కార్యక్రమమును పూర్తిచేసెను. తరువాత మిగిలియున్న ధనముతో తన కున్న ఋణములను తీర్చెను. బియ్యము, పప్పులు మొదలగు వాటిని తన కొడుకులకు, కొమార్తెలకు నిచ్చెను.

ఇదియు పుణ్యములో పాపమే గదా! పేదలకుగాని, వృద్ధులకుగాని, భక్తులకుగాని, సాధువులకుగాని సేవచేసి, భోజనము పెట్టి, ధనమునిచ్చి వారికి బాధ కలుగునట్లు వర్తించినను, మాటలు మాట్లాడినను పుణ్యములో పాపమే యగును.

## 29. స్త్రీ జన్మ విశిష్టత

"కీర్తిశ్శ్రీ ర్వాక్చ నారీణాం స్మృతి ర్మేధా ధృతిః క్షమా"

అని గీత దశమాధ్యాయములో చెప్పబడినది. అనగా స్త్రీలలో గల కీర్తి శ్రీవాక్కులో గల మృదుత్వము, జ్ఞాపకశక్తి, మేధస్సు ( తెలివితేటలు ), ధైర్యము, ఓర్పు– ఇవి భగవంతుడ నగు నా విభూతులు అని భగవంతుడు చెప్పెను. కనుక పురుషులలోకంటె స్త్రీలలోనే గొప్ప గుణములు గలవని తెలియుచున్నదిగదా. స్త్రీలు అహింసా స్వరూపులని గాంధీమహాత్ముడు చెప్పెను. పురుషులలో కఠినస్వభావ మెక్కువగా నుండును. స్త్రీలలో మెత్తని



స్వభావము, దయారసగుణము, కరుణాస్వభావము లెక్కువగా నుండును.

శివుని భోలాశంకరు డని చెప్పుదురు. అనగా కొలది కాలము స్తుతించినంత మాత్రమున అనుగ్రహము ( దయ ) చూపువాడని తాత్పర్యము. స్త్రీలలోకూడ భోలాస్వభావము గలవా రెక్కువగా కనబడుచుందురు. పురుషులలో స్త్రీల స్వభావము గలవారు కలరు. స్త్రీలలో పురుషుల స్వభావము గలవారున్ను కలరు. మెత్తని స్వభావము గలవారలలో ననేకులు అవినీతి ( చెడు ) వర్తనలకు లోబడుచుందురు. సత్యధర్మములపై అచంచల పట్టుదలగలవారు మాత్రమే ఇతరులు అవినీతి వర్తనలకు లొంగదీయుటకు ప్రయత్నించినను లోబడరు. అహంకారమున్నంతవరకు మానవునకు అశాశ్వత సుఖములపై భ్రాంతు లుండును.

ప్రశ్న : స్వామీ! మీరు స్త్రీలను విశేషముగా పొగడెద రేల? స్త్రీలు అబలులని, అసమర్థులని, చంచలు రని, పురుషులకంటె స్త్రీలకు ఎనిమిది రెట్లు కామ ముండుననియు చదివియుంటిని. మఱియు శంకరాచార్యులవారు స్త్రీ శరీరమును నీచమైనదిగా, సర్వవేదాంత సిద్ధాంత సంగ్రహమున వర్ణించిరి. ప్రశ్నోత్తర మణి రత్నమాలలోకూడ స్త్రీలు నరకద్వారములనియు, కల్లువలె మోహింపజేయునది స్త్రీ యనియు, జీవులకు సంకెళ్లు స్త్రీ యనియు, స్త్రీపిశాచముచే వంచింపబడనివాడే జ్ఞాని యనియు చెప్పిరి.

శ్లో. కులీనా రూపవత్యశ్చ నాథవత్యశ్చ యోషితః
మర్యాదాసు న తిష్ఠంతి స దోషః స్త్రీషు గరీయాన్ ॥

తా. స్త్రీలు మంచికులమునందు పుట్టినను, రూప కులైనను, భర్తగలవారైనను నియమము గలిగి ండరు. ఇదియే స్త్రీలలో గల పెద్ద దోషము.

అనృతం సాహసం మాయా దాక్షిణ్యం చలచిత్తనం
రోదనం అపవాదం చ సప్తైతే స్త్రీస్వభావికమ్ ।

తా. (1) అబద్ధమాడుట (2) నేను చేసెద నని సాహ చూపుట (3) విపరీత భ్రమలు చేయుట (4) దయా ము గలిగియుండుట (5) చిత్తచాంచల్యము గలిగి ండుట (6) సామాన్యవిషయములకు దుఃఖపడుట (7) లేని దోషములను ఆరోపణచేసికొనుట—ఈ ఏడున్ను లకు స్వభావముగా నుండును. (శివపురాణము)

ం. దయమాలి ప్రియుతోడ దప్పుజేసియు నబ
ద్ధమ్ము లాడుట యాడుదాని సొమ్ము
ప్రాణమ్మునకు గడ్డిపరకంత వెలయైన
దలపకుండుట యాడుదాని సొమ్ము
అత్యంత లోభమ్ము నంది యూరక మౌర్ఖ్య
మూనియుండుట యాడుదాని సొమ్ము
అవమానమునకు లోనై దురాచార ప
ద్ధతి వహించుట యాడుదాని సొమ్ము

గీ. కష్టసంసారమునకు లోగా నొనర్చి
దాటనీకుండు టది యాడుదాని సొమ్ము
లేనిపోని విలాసమ్ము లూని మోక్ష
దశను జెడగొట్టు టది యాడుదాని సొమ్ము.
(దేవీభాగవతము)

ఈవిధముగా స్త్రీలలో అనేక దోషము లుండగా లను మీరు స్తుతించుట యనునది నా కాశ్చర్యము



గలిగించుచున్నది. స్త్రీలలో గొప్పతన మున్నచో ప్రమాణములతో తెలియజేసినచో నేను నమ్మగలను. స్త్రీలను విమర్శించితి నని మీరు నాపై కోపము చూపకుందురుగాక యని కోరుచున్నాను.

జవాబు : సోదరా! స్త్రీలను విమర్శించుట, దూషించుటయును మహాపాపము. స్త్రీలలోగాని, పురుషులలోగాని గల చెడును మాత్రమే దూషించి దూరముగా నుండవలెను.

స్త్రీలలో (1) పద్మినిజాతి (2) హస్తినిజాతి (3) చిత్రిణిజాతి (4) శంఖినిజాతి యని నాలుగు జాతులవారు కలరు. ఇట్లే,

పురుషులలో (1) భద్రుడు (2) దత్తుడు (3) కూచిమారుడు (4) పాంచాలుడు అను నాలుగు తరగతులవారు కలరు అని శాస్త్రము చెప్పెను.

కామ మనెడి దుర్గుణమును నశింపజేసికొనుటకే స్త్రీ శరీరమును నీచముగా శంకరాచార్యులవారు వర్ణించిరి. ఇట్లే స్త్రీలుకూడ పురుషుల శరీరమును నీచమైనదిగా వర్ణించుకొని విరక్తి నొందవలెను. పురుషులకు స్త్రీ నరకద్వారమైతే, స్త్రీలకు పురుషులు నరకద్వారముకాదా? ఇచట స్త్రీలకైనను,పురుషులకైనను కామమే నరకద్వారమని గ్రహించవలెను. స్త్రీలకంటె పురుషులకే ఎనిమిది రెట్లు కామము కనబడుచున్నది. పురుషునికంటె స్త్రీ గొప్పదగుటచేతనే స్త్రీనామము మొదట పిలువబడుచున్నది. ఎట్లన తల్లి దండ్రి, లక్ష్మీ నారాయణ, పార్వతీ పరమేశ్వరులు, సీతా రాములు, భార్యా భర్త, స్త్రీ పురుషులు.

శంకరాచార్యులకు స్త్రీపై గౌరవ ముండుటవలననే తమ పీఠమునకు శారదాపీఠ మని పేరు పెట్టుకొనెను.

స్త్రీలలోను, పురుషులలోను ఉత్తములు, మధ్యములు, అధములు, అధమాధములు యను నాలుగు తరగతులుగా నుందురు. సుకృతవిశేష మున్నచో అధమాధమ స్థితి నుండి పరిణామము జెంది ఉత్తమోత్తమ స్థితికి రాగల్గుదురు. లోకములో మంచివారు చెడ్డవారుగా మార్పుజెందుట చూచుచున్నాము. చెడ్డవారు మంచివారుగా మార్పుజెందుట చూచుచున్నాముగదా! స్త్రీలందరున్న అపవిత్రులని, అసమర్థులనియు తలంచరాదు. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు దేవీ యాజ్ఞప్రకారము నడచుకొనుచున్నారని చరిత్రలో కలదు.

అనసూయ త్రిమూర్తులను పసిబాలురను చేసినట్లు చరిత్రకలదు. అనసూయ, అరుంధతీ దేవులను త్రిమూర్తులు, లక్ష్మి, పార్వతి, సరస్వతులున్న గౌరవించినట్లు చరిత్ర కలదు.

సుమతి సూర్యుని ఉదయించకుండ చేసినట్లు చరిత్ర కలదు. సావిత్రి యమధర్మరాజుతో వాదించి చనిపోయిన తన భర్తను బ్రతికించుకొనినట్లును చరిత్ర కలదు.

రావణాసురుని భార్యయగు మండోదరి, విభీషణుని భార్యయైన సరమ, రావణుని కోడలగు సులోచనయు ఉత్తమ స్త్రీలని పొగడబడిరి. స్త్రీలు అబలులు, అసమర్థులునైనచో శిక్షించే శక్తి, రక్షించే శక్తియు నుండదుగదా! కేకయ రాజు మందరయొక్క అల్లుని చంపుటవలన క్రోధము నుంచుకొని, కేకయరాజుయొక్క అల్లుడగు దశరథమహారాజును చంపించెను. భీష్మాచార్యులవారు తన్ను అన్యాయముచేసెనని అంబ క్రోధము నుంచుకొని శిఖండిగా బుట్టి భీష్ముని చంపించెను.



గంగాదేవి, జ్వాలాదేవియు అర్జునునిపై క్రోధము గలవారై చచ్చునట్లు శపించిరి. అందువలన అర్జునుని కుమారుడగు బభ్రువాహనుడు అర్జునుని శిరస్సును ఖండించి రహస్యముగా శిరస్సును దాచెను. తరువాత శ్రీకృష్ణ భగవానుడు తన ప్రభావముచే శిరమును రప్పించి అర్జునుని బ్రతికించెను. ఈ కథ విపులముగా జైమినీభారతములో గలదు.

సులభ, గార్గి, మైత్రేయి, మదాలస, చూడాల మొదలగు మహాతల్లులు బ్రహ్మజ్ఞాన సంపన్నులని చరిత్రలు చెప్పుచున్నవి. అజ్ఞానిగాయున్న శిఖధ్వజమహారాజును భార్య యగు చూడాల జ్ఞానవంతునిగాచేసి రాజ్యపరిపాలన చేయించెను. అజ్ఞానిగాయున్న లీలాశుకునకు చింతామణి జ్ఞానబోధచేసి పరమభక్తునిగా, గ్రంథకర్తనుగాజేసెను. తులసీదాసునకు తన భార్యయే వైరాగ్యమును బోధించి మహాభక్తునిగా జేసెను. తరిగొండ వేంకమాంబ తరిమెల గ్రామమున పుట్టి పరమభక్తురాలై కొన్ని మహిమలనుకూడ చూపి తరువాత తిరుపతి క్షేత్రమునకు చేరి శ్రీ వేంకటేశ్వర స్వామియొక్క అంతరంగభక్తురాలై తపస్సుచేసి జ్ఞానవంతురాలై అనేకమందిని సన్మార్గమున నడిపించుచు, అనేక సద్గ్రంథములను వ్రాసి మహాత్మురాలని ప్రసిద్ధికెక్కెనుగదా! శ్రీ రామకృష్ణపరమహంసగారికి భైరవ బ్రాహ్మణి యను స్త్రీ మొదటి గురువుగానుండెను. శ్రీ మెహర్ బాబాగారికి, హాజరతుబాబాజాను అను స్త్రీ మొదటి గురు వయ్యెను. శ్రీ బుద్ధదేవుడు ఆహారమును మాని తపస్సుచేయుచు నీరసించి మృత్యువాత బడబోవునపుడు స్త్రీలే జీవనధర్మమును తెలిపి ఆహారమునుపెట్టి రక్షించిరి. విశాఖాదేవి యను

ప్రధాన శిష్యురాలు బుద్ధుని, వాని సంఘమును చాలాకాలము పోషించెను. శ్రీ రామకృష్ణపరమహంసగారిని రాణీరాసమణి పోషించెను. శ్రీ రమణమహర్షులవారిని మొదటి నుండియు స్త్రీలే పోషించుచువచ్చిరి. మొదలియార్ పాటికి యను భక్తురాలు నలుబదిసంవత్సరములు ఆహారమును పెట్టినది. స్త్రీల సహాయమువలననే శ్రీ గాంధీ, శ్రీ అరవింద యోగి, శ్రీ మలయాళస్వాములవారు, శ్రీ ఓంకారస్వాములవారు మొదలగు మహాత్ముల ఆశ్రమములు అభివృద్ధికివచ్చి పోషింపబడుచున్నవి.

భక్తవిజయమను గ్రంథములో మీరాబాయి, సక్కుబాయి, గోమాబాయి, కర్మాబాయి, జనాబాయి, ప్రేమాబాయి, రామాబాయి, పిళాబాయి, గుణవతీబాయి, కుపరాబాయి, శీలాబాయి, కస్తూరిబాయి, కృష్ణాబాయి, కారక్కాలమ్మ, భక్తిమతి, నిర్మల, కన్హోపాత్ర, శబరి మొదలగు మహాతల్లుల చరిత్రలను చదువుచున్నాముగదా !

స్త్రీలుకూడా రాజ్యపరిపాలన చేయుట కలదు. శిఖధ్వజమహారాజు వైరాగ్యముతో అరణ్యమునకు పోయి నివసించినపుడు భార్యయగు చూడాలయే రాజ్యపరిపాలన చేసెను. మనకు స్వరాజ్యము రాకపూర్వము ఇంగ్లాండు దేశపు రాణీగారే మనదేశమును పరిపాలించెనుగదా ! సింహళదేశమున స్త్రీయే మంత్రిపదవి నలంకరించెను. మన దేశమునం దిపుడు శ్రీమతి ఇందిరాగాంధి ప్రధానమంత్రి పదవి నలంకరించి పరిపాలించుచున్నారుగదా !

పురుషులు స్త్రీలను దూషించుచున్నచో, తిరస్కరించుచున్నచో స్త్రీ సహాయము లభించక పురుషుడు బాధపడవలసివచ్చును. ఇట్లే స్త్రీలు పురుషులను దూషించి



నను, తిరస్కరించినను పురుషుని అండ లభించక స్త్రీలు బాధలు నొందవలసివచ్చును.

శ్లో. అసారభూతే సంసారే సారభూతా నితంబినీ
ఇతి సంచింత్యవై శంభుః అర్ధాంగే కామినీం దధౌ॥

తా. అసారమైన ఈ లోకమందు సారమైనది స్త్రీయే. ఇది తెలిసియే కాబోలు శివుడు తన అర్ధశరీరమున స్త్రీని ధరించినాడు.

శ్లో. యత్ర నార్యస్తు పూజ్యంతే రమంతే తత్ర దేవతాః
యత్రైతాస్తు నపూజ్యంతే సర్వాస్తత్రాఽఫలాః క్రియాః॥

తా. స్త్రీలు పూజింపబడుచున్న స్థలముననే దేవతలు తిరుగుదురు. స్త్రీలకు గౌరవము యీయబడని తావులందు జరుగు సర్వక్రియలును నిష్ఫలములే. (మనువు)

## నే నెవరిని ?

మంచిపనులను చేయుచున్నంతవరకును నీవు సజ్జనుఁడవు.

చెడ్డపనులను చేయుచున్నపుడు నీవు దుష్టుడవు.

కనబడే రూపములపై, వినబడే శబ్దములపై, పనులపైని ఆసక్తి, ద్వేషభావము లున్నంతవరకు నీవు సంసారివి.

నామ రూప క్రియలపై రాగద్వేషములు నశించినపుడు నీవు సన్న్యాసివి.

సర్వమును దేవునిగా నిశ్చయించి అన్నిపనులను దైవార్పణము చేయుచు సర్వదా దేవుని స్మరించుచున్నంత వరకు నీవు భక్తుడవు.

నీలో కామ మున్నపుడు కామమే నీవు. క్రోధ మున్నపుడు క్రోధమే నీవు. భయ మున్నపుడు భయమే నీవు. అహంకార మున్నపుడు అహామే నీవు. మమకార మున్నపుడు

మమకారమే నీవు. సుఖమున్నపుడు సంతోషమే నీవు. దుఃఖమున్నపుడు దుఃఖమే నీవు. దైవభావముతో నున్నపుడు దైవమే నీవు. ఆత్మభావముతో నున్నపుడు ఆత్మయే నీవు. మల, విక్షేప, ఆవరణ దోషములు నశించినపుడు సాక్షాత్తుగా పరబ్రహ్మస్వరూపుడవే నీవు. ఇదే కైవల్యము. మోక్షము. అద్వైతము. పరిపూర్ణము. అచలము.

మాయతో మాయను ప్రేమించుట సంసార మగును.

మాయతో దేవుని (సద్గురువును) నమ్మియుండుట భక్తియగును.

మాయను అతిక్రమించుట జ్ఞాన మగును.

సీ. ఆలు బిడ్డలు తనకు అణగియుండకయున్న
సంసార మది గొప్ప సాగరంబు
అన్నదమ్ములు తనకు అణగియుండకయున్న
సంసార మది గొప్ప సాగరంబు
సిరి సంపదలు బోయి చిక్కులొచ్చినతోడ
సంసార మది గొప్ప సాగరంబు
బీదతనమున భాగ్యపేరాస గలిగిన
సంసార మది గొప్ప సాగరంబు
తే. సప్తజలధుల నీదియు సైపవచ్చు
యిట్టి సంసార మొక ఘంట యీదరాదు
ధరను యీ కష్టమును దీర్ప దైవ మనగ
ఆత్మ నమ్మితి నారాయణార్య నిన్ను.
సీ. స రి గ మల్ పాడుచు సంచలించెడి మది
నిశ్చలంబుగ దేవు నెరుగబోదు
ఇరుగుపొరుగుల పోరు విని సంభ్రపడు మది
నిశ్చలంబుగ దేవు నెరుగబోదు



తనకు మించిన పనికి త్వరపడు నా మది
నిశ్చలంబుగ దేవు నెరుగబోదు
కష్టమొచ్చెడివేళ కలతజెందెడి మది
నిశ్చలంబుగ దేవు నెరుగబోదు
తే. నిష్ఠగలిగియు నీయందు నిలుచు మనసు
యిట్టి విషయంబు లన్నియు విడిచిపెట్టి
ఏకదృష్టిని మనసుకు యెరుగజేయ
ఆత్మ నమ్మితి నారాయణార్య నిన్ను.

## 30. భగవంతుడా! మా మొర విను

ఆ. చావు పుట్టు గలుగు సంసార సుఖమందు
సారమేమి లేదు తేరి జూడ
సారమనెడి బుద్ధి చావంగ జేయరా
ఆర్తిహరణ! కృష్ణ! యాదిదేవ.

ఆ. కదల మెదలనీవు కాంక్షలెన్నియొబట్టి
కావరార నన్ను కలుషరహిత
కాలిపోవుచుంటి కాంక్షల నడుమను
ఆర్తిహరణ! కృష్ణ! యాదిదేవ.

ఆ. భక్తితోడ నెపుడు భగవంతుడా యని
భజన జేయునట్టి భాగ్య మిచ్చి
బాధలెల్ల నిపుడె బాయంగజేయరా
ఆర్తిహరణ! కృష్ణ! యాదిదేవ.

ఆ. పుట్టి చావనట్టి పూర్ణపదము జూపు
వట్టి భ్రాంతితోడ పట్టుబడితి

చచ్చి పుట్టుటందు సౌఖ్యంబు లేదుగా
ఆర్తిహారణ! కృష్ణ! యాదిదేవ.

ఆ. భ్రాంతచిత్తుడ నయి బాధింపబడుచుంటి
భ్రాంతి దొలగజేసి బాధ లుడిపి
చేయిబట్టి నన్ను చేర్చుకో చెంతకు
ఆర్తిహారణ! కృష్ణ! యాదిదేవ.

ఆ. పిచ్చిపట్టినట్లు ప్రీతితో దిరుగును
తుచ్ఛసుఖముకొఱకె దుష్టబుద్ధి
అచ్ఛమైన సౌఖ్య మాత్మలో గాంచదే
ఆర్తిహారణ! కృష్ణ! యాదిదేవ.

ఆ. కదలకుండు మనుచు మెదలకుండు మనుచు
హితము జెప్పుచుంటి సతత మిలను
చెప్పుమాట మనసు చెవిబెట్టదేమిరా
ఆర్తిహారణ! కృష్ణ! యాదిదేవ.

ఆ. తత్త్వమెఱుగనీక తబ్బిబ్బుగా జేసె
పట్టుకొనెద మనిన పట్టుబడదు
పట్టి మనసు నిలుప పరమాత్మ వేడెద
ఆర్తిహారణ! కృష్ణ! యాదిదేవ.

ఆ. వద్దువద్దనియును గద్దరించుచునున్న
హద్దుమీరి మనసు అరుగుచుండె
పెద్ద బాధవచ్చె పరమాత్మ దీనితో
ఆర్తిహారణ! కృష్ణ! యాదిదేవ.

ఆ. నిఖిలలోకరక్ష! నిన్ను శరణుజొచ్చి
వరమువేడ నాకు వాంఛగలిగె
చంచలంబు బాపి శాంతి చేకూర్చుము
ఆర్తిహారణ! కృష్ణ! యాదిదేవ.



ఆ. ఆశ లుడుగజేసి యానందవార్ధిలో
ననుదినంబు ముంచి యాపదలను
బాయజేయుమయ్య ప్రార్థింతు భక్తితో
ఆర్తిహారణ! కృష్ణ! యాదిదేవ.

ఆ. అఖిలజగము నీదు ఆకారమను దృష్టి
అనవరతము వీడనట్టి తెలివి
గలుగనిమ్ము నాకు కల్యాణదాయక
ఆర్తిహారణ! కృష్ణ! యాదిదేవ.



ఆ. భోగచింతమాని భోగిశయన నిన్ను
భజనచేయునట్టి భాగ్య మిమ్ము
మలినవాసనలను మాన్పుము నాతండ్రి
ఆర్తిహారణ! కృష్ణ! యాదిదేవ.

ఆ. వైరరాగములను వదలించి సతతము
భక్తితోడ నీదు ప్రార్థనంబు
జేయగలుగు నేర్పు జేకూరజేయుము
ఆర్తిహారణ! కృష్ణ! యాదిదేవ.

ఆ. జ్ఞేయసుఖము వీడె హేయసౌఖ్యములకై
యరుగుచుండె మనసు అనుదినంబు
పాడుమనసు దీని బట్టి బంధింపుము
ఆర్తిహారణ! కృష్ణ! యాదిదేవ.

ఆ. అహము చావదాయె ఆశ వీడదాయె
ఆత్మలోన మనసు అతకదాయె
అంతులేని బాధ అవనిలో గల్గెరా
ఆర్తిహారణ! కృష్ణ! యాదిదేవ.